మహిళా ఉద్యమ కరదీపిక

# చైతన్య మానవి



త్రైమాసపత్రిక

ఏప్రిల్ - జూన్, 2014

తెలంగాణా

ఆంధ్రప్రదేశ్

జూన్ 2

2014

## తెలుగు నేల రెండు రాష్ట్రాలు

CI



మే 27

# కందుకూరి వీరేశలింగం

## వర్ధంతి సందర్భంగా

కందుకూరి, గురజాడ, రాజారామ్మోహన్‌రాయ్ వంటి సంఘ సంస్కర్తలు సాంఘిక దురాచారాలకు వ్యతిరేకంగా గళం విప్పారు. తమదైన శైలిలో పోరాడి ఏటికి ఎదురీదారు. దురాచారాలను విమర్శిస్తూ మహాకవి "కాళ్ళకూరి నారాయణ రావు"గారు రాసిన ఈ పద్యం పాఠకుల కోసం...

కట్నాలకై పుస్తకములు చేగొని పాఠశాలలకేగెడు చవటలారా

పిలచి పిల్లనిచ్చినవారి కొంప-లమ్మించెడి కుమతులారా

అలకపాన్పులనెక్కి అవీ ఇవీ కావలెనని-శివమాడెడు యదములారా

ఎంతబెట్టినదిని ఎప్పటికప్పుడు-నిష్ఠురోక్తులు బల్కు నీచులారా

కట్నమను పేర ఒక చిల్లి గవ్వ గొనిన-భార్యకమ్ముడువోయిన బంటులగుచు-

జన్మదాస్యంబు సలుపుడు సలుపకున్న-అత్తవారింట కుక్కలై అవతరింత్రు

# ప్రజల ఆకాంక్షలను వమ్ము చేయెుద్దు

చైతన్య మానవి

సంపాదకీయం...

16వ లోక్‌సభ ఎన్నికలలో దేశ ప్రజలు కాంగ్రెస్‌కు వ్యతిరేకంగా నిర్ణయాత్మకమైన తీర్పు యిచ్చారు. అవినీతి, అసమర్థ పాలన అందించిన కాంగ్రెస్ పార్టీని ఎన్నడూ లేనంత ఘోరంగా తిరస్కరించారు. కాంగ్రెస్‌పై ఏర్పడిన వ్యతిరేక వెల్లువను మోడీ ప్రభంజనంగా మార్చుకోగలిగారు. కార్పొరేట్ శక్తుల చేతుల్లోని ఆర్థిక వనరులు, సమాచార సాధనాలు, సంఘ్ పరివార్ యంత్రాంగం ఈ విజయానికి పెద్ద ఎత్తున దోహదపడ్డాయి. ఏది ఏమైనా ప్రజలు కాంగ్రెస్ దుష్ట విధానాలకు, ధరల పెరుగుదల, వ్యవసాయ సంక్షోభం వంటి విధానాలపైనే గాకుండామహిళలు, బాలిక భద్రత సమస్య కూడా ప్రధాన అంశంగా మారింది. ప్రజల రోజువారీ జీవనంపై నిరంతరంగా పడుతున్న భారాలూ, దాడుల నుంచి తమకు ఉపశమనం కలుగుతుందని భావించి ఓటు వేశారు. మితవాద శక్తులు, కార్పొరేట్ శక్తుల తోడ్పాటుతో గెలిచిన బిజెపి, కాంగ్రెస్ అనుసరించిన ఆర్థిక విధానాలు అనుసరిస్తుందనటంలో సందేహం లేదు. ఈ ఎన్నికల ప్రచారంలో అంతర్లీనంగా సాగిన హిందూత్వ ఎజెండా వలన మన లౌకిక ప్రజాస్వామ్య పునాదులకు మరింత ముప్పు వాటిల్లే ప్రమాదముంది. మతోన్మాదశక్తులు మరింత విజృంభించే అవకాశాలు ఉన్నాయి. అన్ని శక్తులు కలిసినా బిజెపికి 31% మాత్రమే ఓట్లు వచ్చాయి.

ఈ ఎన్నికలలో భారత పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని ఖూనీచేస్తూ మద్యం, ధన ప్రవాహం విచ్చలవిడిగా సాగింది. కోట్లు ఖర్చు పెట్టేవారికే సీట్లు దక్కాయి. ఓటర్లను డబ్బుతో కొనుగోలు చేశారు. వామపక్షాల బలం పెరగకుండా కార్పొరేట్ శక్తులు చేయవల్సిన ప్రయత్నాలన్నీ చేశాయి. ప.బెంగాల్‌లో తృణమూల్ కాంగ్రెస్ హింసాకాండ, రిగ్గింగ్ విచ్చలవిడిగా కొనసాగించింది. 42స్థానాలలో 32చోట్ల రిగ్గింగ్, హింసాకాండ సాగింది. నేర చరిత కల్గిన వారు పెద్ద సంఖ్యలో ఎన్నికయ్యారు.

మహిళా సాధికారితకు పెద్దపీట వేస్తామని ఆకాశంలో సగానికి అవకాశాల కల్పనలో ఏలోటూ చేయబోమని చేసిన నేతల ప్రసంగాలకి, ఆచరణకీ పొంతన లేదన్నది ఎన్నికల ఫలితాల విశ్లేషణలు తెలియజేస్తున్నాయి. 16వ లోక్‌సభకు ఎన్నికైన 543 మంది సభ్యులలో పురుషులు 89% ఉంటే మహిళలు కేవలం 11% మాత్రమే. 15వ లోక్‌సభలో 59 మంది మహిళా సభ్యులకు గాను ఈసారి అదనంగా ఇద్దరు మాత్రమే పెరిగారు. జనాభాలో 49% స్త్రీలున్న దేశం మనది. పురుషుల కన్నా మహిళా ఓటర్లు గణనీయంగా ఓటు హక్కును వినియోగించుకున్నారు. అత్యున్నత చట్టసభలో మహిళలకు 33% రిజర్వేషన్‌పై ఎన్‌డిఎ సర్కార్ మహిళల ఆశలు నెరవేరుస్తుందా లేదా వేచి చూడాలి.

తెలంగాణ రాష్ట్రం ఏర్పడితే తమ సమస్యలన్నీ తీరుతాయని ప్రజలు గంపెడాశలతో వున్నారు. టిఆర్ఎస్ ప్రకటించిన ఎన్నికల ప్రణాళికతో మరింత అశలు చిగురించాయి. అందువలనే తెలంగాణ యిచ్చింది కాంగ్రెస్ అయినా ఉద్యమ రథసారథికే పట్టం కట్టారు. ప్రజల ఆశలు నెరవేరే దిశగా టిఆర్ఎస్ ప్రభుత్వం కృషి చేస్తుందని ఆశిద్దాం.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాన్ని ముక్కలు చేసిన కాంగ్రెస్ ఘోర పరాజయం పొందింది. రాష్ట్రాభివృద్ధి జరగాలంటే తెలుగుదేశం నాయకుడు చంద్రబాబుకే సాధ్యమని ప్రజలు పట్టం కట్టారు. అభివృద్ధి, కొత్త రాజధాని అంశాలు ముందుకు రావడం కూడా తెలుగుదేశానికి తోడ్పడింది.

యుపిఎ అనుసరించిన ప్రజావ్యతిరేక విధానాలకు వ్యతిరేకంగా కేంద్రంలోనూ, తెలంగాణ, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలలోనూ ప్రజలు యిచ్చిన తీర్పును వమ్ము చేయకుండా విలువలతో కూడిన నీతివంతమైన సుపరిపాలన అందించాలి. చట్టసభల్లో 3వంతు మహిళా బిల్లుకు 16వ లోక్‌సభలో మోక్షం కల్పిస్తారని ఆశిద్దాం.

**సూక్తి : జీవితం ఓ గొప్ప విద్యాలయం. ఇందులో నేర్చుకోగలిగినంత నేర్చుకోవచ్చు. - మార్షల్**

# చైతన్య మానవి




**అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం రాష్ట్ర కమిటీ**

చిరునామా:

బ్లాక్ నెం. 24, హెచ్ఐజి ఫేజ్: 2,1-8-1,
బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్ - 500 044.
ఫోన్ : 27605845.

e-mail chaitanyamanavi@gmail.com

సంపాదకులు

**టి. జ్యోతి**

సంపాదక వర్గం

**మల్లు స్వరాజ్యం**

**అల్లూరి మన్మోహిని**

**ఎస్. పుణ్యవతి**

**కె. స్వరూపరాణి**

మేనేజర్

**ఎం. సుధ**

**విరాళం రూ : 10/-**

**ప్రజాశక్తి డైలీ ప్రింటింగ్ ప్రెస్, అజమాబాద్, హైదరాబాద్ - 500 044.**


## ఈ సంచికలో...

నోట్




# పని ప్రదేశాలలో మహిళలపై లైంగిక వేధింపులు చట్టం 2013

– ఐద్వా కేంద్రకమిటి

విశాఖ కేసు జరిగిన దాదాపు 16 సం॥ల తర్వాత మరల నేడు ఈ చట్టంపైన విస్తృతమైన చర్చలు జరుగుతున్నాయి. ఒక సుప్రీంకోర్టు జడ్జీ - చట్టంపై చేసిన అభియోగాల కారణంగా ఈ చట్టంలోని లోపాలతోపాటు సుప్రీంకోర్టు తన గైడ్‌లైన్స్‌ని తానే అమలు చేయకపోవడం కంప్లయింట్ కమిటీని ఏర్పాటు చేయక పోవడం వంటి విషయాలు వెలుగులోకి వచ్చాయి. ఈ తీర్పు విషయంలో నిర్వహించిన దర్యాప్తు కారణంగా విశాఖ తీర్పుకు పూర్తి విరుద్ధమైన, నిరాశాజనకమైన విధంగా కోర్టు తన బాధ్యతల నిర్వహణలో వైఫల్యం చెందిందనే అభిప్రాయం వెలువడింది.

తరుణ్ తేజ్‌పాల్ కేసు సందర్భంలో కూడా ప్రభుత్వం పార్లమెంట్‌లో చట్టాన్ని పాస్ చేసి ఒక సం॥ కాలం గడిచినప్పటికీ, అమలు చేయడంలో మాత్రం విఫలమైందన్న విషయం స్పష్టమైంది. ఈ నోటిఫికేషన్ వచ్చిన పిమ్మట సుప్రీంకోర్టు జడ్జిపైనే అభియోగాలు ఈ సందర్భంలో సుప్రీంకోర్టు ఈ కేసును ఏ విధంగా పరిశీలిస్తుందో వేచి చూడాల్సివున్నది. జడ్జీలు తాము చేసిన చట్టానికి లోబడి వుండకపోవడాన్ని ఈ ఘటన ఎత్తి చూపుతోంది.

### పని ప్రదేశాలలో మహిళలపై లైంగిక వేధింపులు

చట్టం నిర్వచన ప్రకారం సెక్షన్ 2 (N) **"లైంగిక వేధింపులు అంటే** - "ఎటువంటి కవ్వింపు చర్యలైనా, శరీరాన్ని ఏ భాగంలో తాకినా, లేదా కోరిక తీర్చమని వత్తిడి చేసినా, లేదా లైంగిక చర్యల గురించి విపరీత అర్థాలతో మాట్లాడినా " అది నేరం.

**సెక్షన్ 3(2)** దీనికి కొనసాగింపుగా ఇటువంటి లైంగికపరమైన వేధింపులు పని ప్రదేశంలోవున్న పని పరిస్థితులపై కూడా తన ప్రభావం చూపుతుంది. ఇది కూడా ఈ లైంగిక వేధింపుల చట్ట పరిధిలోకి వస్తుంది.

**ఈ చట్టం యొక్క లక్ష్యం "పని ప్రాంతాలలో లైంగిక వేధింపులని అరికట్టడం, నిషేదించడం మరియు ఇటువంటి వేధింపులని త్రిప్పికొట్టడం." ఈ లక్ష్యం కొరకు సెక్షన్ 4(9) ప్రకారం ప్రతి సంస్థలో " అంతర్గత ఫిర్యాదుల కమిటి "ని ఏర్పాటు చేయాలి.**

సెక్షన్ 3(2) ప్రకారం" లైంగిక కోరికలు తీర్చమని మహిళలపై యజమానులు, పురుష ఉద్యోగులు విధించే ఎటువంటి షరుతులైనా, భయపెట్టడమైనా, బాధించడమైనా, వ్యతిరేకమైన పని పరిస్థితులు కల్పించడమైనా కూడా ఈ చట్ట పరిధిలోకి వస్తాయి. ఈ లైంగిక వేధింపులకి గురికాబడిన మహిళలకు ఆరోగ్యపరమైన సమస్యలు కూడా ఉత్పన్నమవుతాయి. వారికి భద్రత కరువవుతుంది. అందువలన ఇటువంటి పరిస్థితులు ఎక్కడ వున్నా గాని అవి ఈ చట్టం పరిధిలోకి వచ్చినట్లే. ఈ చట్టం యొక్క లక్ష్యం "పని ప్రాంతాలలో లైంగిక వేధింపులను అరికట్టడం, నిషేదించడం మరియు ఇటువంటి వేధింపులని త్రిప్పికొట్టడం." ఈ లక్ష్యం కొరకు సెక్షన్ 4(9) ప్రకారం ప్రతి సంస్థలో " అంతర్గత ఫిర్యాదుల కమిటి "ని ఏర్పాటు చేయాలి.

### నియమ నిబంధనలు:-

- ఈ కమిటీలోని సభ్యులని సంస్థ యజమానే నామినేట్ చేయాలి. మెంబర్లు(1) ఒకరు సీనియర్ ఉద్యోగి (మహిళ) నిర్వహణాధికారిగా వుండాలి. చట్టం గురించి అవగాహన వున్నటువంటి, సామాజిక చైతన్యం కల్గిన ఇద్దరు ఉద్యోగులను సభ్యులుగా కమిటీలోకి తీసుకోవాలి. ఎన్. జి. ఓ. లనుండి ఒకరిని మెంబరుగా వుంచాలి. కమిటీలో కనీసం సగం మంది మహిళలే మెంబర్లుగా వుండాలి.
- సెక్షన్ 26(1) ప్రకారం కమిటి

**సహోద్యోగులు లేదా యజమాని లైంగిక వేధింపులపై బాధిత మహిళ ఫిర్యాదు చేయడానికి ఎక్కువగా భయపడతారు. ముందుకి రావడానికి జంకుతారు. సాధారణంగా ఈ లైంగిక వేధింపులు ప్రైవేటుగా జరుగుతుంటాయి. సాక్షులు కూడా ముందుకి వచ్చి సాక్ష్యం చెప్పడానికి ఇష్టపడరు. ఎందుకంటే యజమాని కోపానికి తాము గురవుతామని భయపడతారు. అందువలన ఫిర్యాదును నిరూపించుకోవడమే కష్టమవుతుంది. ఫిర్యాదులని అబద్ధపు ఫిర్యాదుగా భావించడం వలన ఫిర్యాదు చేసిన మహిళలే కొన్నిసార్లు బలి అవుతున్నారు.**

ఏర్పాటు చేయని సంస్థ యజమానిని నేరస్థునిగా పరిగణిస్తారు. ఆ యజమానికి కనీసంగా రూ॥ 50,000/- జరిమానా విధించవచ్చును.

● చట్టం ప్రకారం ప్రాంతీయ ఫిర్యాదుల కమిటీని జిల్లా అధికారులు ఏర్పాటు చేయాలి. పదిమంది కన్న తక్కువ ఉద్యోగులు ఉన్న సంస్థలలో పనిచేసే మహిళలపై సంస్థ యజమానే ప్రత్యక్షంగా వేధింపులకి పాల్పడినట్లయితే, ప్రాంతీయ ఫిర్యాదుల కమిటికి ఫిర్యాదు చేయవచ్చును.

● బాధిత మహిళ లైంగిక వేధింపులు జరిగిన మూడు మాసాలలోపు ఈ కమిటికి ఫిర్యాదు చేయవలెను. ఈ కమిటి ఎక్కడైనా ఏర్పాటు కాని పక్షంలో ఆ మహిళ ప్రాంతీయ కమిటీలకు డైరెక్టుగా ఫిర్యాదు చేయవచ్చును. ఈ ఫిర్యాదు వ్రాతపూర్వకంగా గానీ, మాటల రూపంలో గాని లేదా కుదించి వ్రాసి ఇచ్చినా గాని చెల్లుతుంది.

● 'అంతర్గత ఫిర్యాదుల కమిటి' ఫిర్యాదు విషయమై దర్యాప్తు నిర్వహించవచ్చును. నిందితుడిని కమిటి ముందుకు హాజరు కమ్మని కోరవచ్చును. అవసరమైన సంబంధిత సాక్ష్యాధార పత్రాలను అందించమని కోరవచ్చును.

● ఫిర్యాదుపై దర్యాప్తు నిర్వహిస్తున్న సమయంలో **"అంతర్గత ఫిర్యాదుల కమిటి"** బాధిత మహిళ కోరిక ప్రకారం నిందితుడిని గాని, బాధిత మహిళని గాని వేరే ప్రాంతానికి బదిలీ చేయమని మేనేజ్‌మెంటుకి రికమండ్ చేయవచ్చును. లేనిచో బాధిత మహిళకు మూడునెలల సెలవు మంజూరు చేయమనవచ్చును. ఈ చట్ట నిబంధనల ప్రకారం "బాధిత మహిళ కోరితేనే" ఇరువైపుల వారిని చర్చలకి ఆహ్వానించి సమస్య పరిష్కరించవచ్చును.

● దర్యాప్తు ముగిసిన వెంటనే "అంతర్గత ఫిర్యాదుల కమిటి" తన నివేదికని యజమానికి అందజేయాలి. నిందితునిపై అభియోగం రుజువైతే అతనిపై తగిన చర్యలు తీసుకోమని కమిటి సూచించవచ్చు. కమిటి తన నివేదిక అందించిన వెంటనే ఈ కమిటియొక్క అధికారాలు ముగుస్తాయి.

**నిందితుడిపై చర్యలు ఈ క్రింది విధంగా తీసుకోవచ్చును**

1) సర్వీసు నిబంధనల ప్రకారం బాధిత మహిళకి చెల్లించవలసిన కాంపన్సేషన్‌ని నిందితుడి జీతం నుండి చెల్లించమని రికమెండ్ చేయవచ్చును. స్థానిక ఫిర్యాదుల కమిటీ అధికారాలు ఇంతవరకే పరిమితమవుతాయి.
2) యజమాని ఈ నివేదిక స్వీకరించిన అరవైరోజుల లోపు తగిన చర్యలు తీసుకోవాలి. చర్యలు తీసుకోవడంలో విఫలమైతే సెక్షన్ 26 ప్రకారం యజమానిని రూ॥ 50,000 జరిమానా చెల్లించమని చెప్పవచ్చును.
3) కోర్టులో సెక్షన్ 27 ప్రకారం బాధిత మహిళ ఫిర్యాదుపైన గానీ, అంతర్గత కమిటి లేదా స్థానిక కమిటీల ఫిర్యాదులపైన మాత్రమే కోర్టు చర్యలు తీసుకోవాలి. దురదృష్టమేమిటంటే ఈ నిబంధనలు సంపూర్ణంగా వ్రాయలేదు.
4) అయినప్పటికి సెక్షన్ 26 ప్రకారం కోర్టులు నేరస్థులను ఇండియన్ పీనల్ కోడ్ ప్రకారం చట్టపరిధిలోకి చేర్చవచ్చును.

**చట్ట పరిమితులు:-**

ఈ చట్టానికి ప్రధానమైన కొన్ని పరిమితులు వున్నాయి. దీని వలన ఈ చట్టంయొక్క ప్రధాన ఉద్దేశ్యాన్ని కూడా మార్చేయవచ్చును.

1. సెక్షన్ 14 ప్రకారం తప్పుడు అభియోగాలు చేసిన మహిళలపైన, అందుకు సాక్ష్యం ఇచ్చిన వారిపైన చట్టప్రకారం పెనాల్టీ విధించవచ్చును. "మహిళలు అలవాటుగా అబద్దాలు చెప్తారు. చట్టాన్ని మోసంచేస్తారు అనే ఒక అభిప్రాయం" ఈ నిబంధన వలన నిర్ధారణకు రావడానికి అవకాశం వుంటుంది. అందువలన బాధిత మహిళ నిజంగా లైంగిక వేధింపులకి గురికాబడినా కంప్లెయింట్ చేయడానికి వెనుకంజ వేయవచ్చును. సహోద్యోగులు లేదా యజమాని లైంగిక వేధింపులపై బాధిత మహిళ ఫిర్యాదు చేయడానికి ఎక్కువగా భయపడతారు. ముందుకు రావడానికి జంకుతారు. సాధారణంగా ఈ లైంగిక వేధింపులు ప్రైవేటుగా జరుగుతుంటాయి. సాక్షులు కూడా ముందుకి వచ్చి సాక్ష్యం చెప్పడానికి ఇష్టపడరు. ఎందుకంటే యజమాని కోపానికి తాము గురవుతామని భయపడతారు. అందువలన ఫిర్యాదులని నిరూపించుకోవడమే కష్టమవుతుంది. ఫిర్యాదులని అబద్ధపు ఫిర్యాదుగా భావించడం వలన ఫిర్యాదు చేసిన మహిళలే కొన్ని సార్లు బలి అవుతున్నారు.

2. "అసంఘటిత రంగం" సెక్షన్ 2 చాలా లోపభూయిష్టంగా వున్నది. కొన్ని అంశాలు మార్పు చేయవలసి వున్నది.

3. ఈ చట్టానికి ముందుగానే యూనివర్శిటిలలో విశాఖ గైడ్‌లైన్స్ ప్రకారం స్థానికంగా ఎన్నుకోబడిన కమిటీలు ఉన్నాయి. ఈ కమిటీలు లైంగిక వేధింపుల ఫిర్యాదులపై చర్యలు తీసుకుంటున్నాయి. ఇటువంటి ఎన్నికైన కమిటీల గురించి ఈ చట్టం ఏమీ చెప్పలేదు. ఒక్క "నియామక కమిటీ" గురించే ప్రస్తావించింది. దీని వలన ప్రజాస్వామ్యయుతంగా ఎన్నుకోబడిన కమిటీల పరిధి ఇప్పుడు సందిగ్ధంలో పడ్డాయి.

**- అనువాదం: పద్మజ**

స్ఫూర్తి

# 'పరమ వీరచక్ర' రూపశిల్పి సావిత్రిబాయి ఖనోల్కర్

- వేములపల్లి సత్యవతి

ప్రతి దేశానికి తనదంటూ ఒక జాతీయ జెండా వుంటుంది. తమదేశపు జాతీయ జెండాను గౌరవించటం, గౌరవ వందనం చేయటం ఆదేశపు ప్రతి పౌరుని ప్రధమ కర్తవ్యం. తెలుగువారమైనందుకు మనమంతా గర్వపడతాం. మొదలు త్రివర్ణ పతాకం భారత జాతీయ కాంగ్రెస్ జెండాగా వుండేది. మధ్యలో రాట్నం వుండేది. స్వతంత్ర దేశమైన తర్వాత రాట్నాన్ని తొలగించి అశోకచక్రాన్ని చేర్చటం జరిగింది.

1948లో అన్ని రంగాలలోను అంకితభావంతో సేవలు చేసి దేశ గౌరవాన్ని, ప్రతిష్టను ఉన్నత దశలోనికి తీసుకెళ్లినవారికి పురస్కారాలతో సన్మానించాలని కేంద్రప్రభుత్వం తలపెట్టింది. అన్ని పురస్కారాలలోనూ తలమానికగా నిలిచి దేశ ప్రతిష్టను ఇనుమడింపచేసే, ప్రధమ గౌరవ పౌర పురస్కారం 'భారతరత్న' గా గుర్తించబడింది. ఈ పురస్కారం ప్రధమంగా విదేశీయుడైన సరిహద్దు గాంధీగా పేరుగడించిన ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్‌కు ఇవ్వబడింది. అప్పటికే అతని జన్మస్థానం దేశ విభజనలో పాకిస్థాన్‌లోనికి వెళ్లింది. రెండవ పురస్కార గ్రహీత డిసెంబర్ 2013లో అస్తమించిన ఆఫ్రికా నల్లసూరీడు నెల్సన్ మండేలా. రాజకీయ రంగంలో బాబూ రాజేంద్రప్రసాద్, మనదేశ ప్రధానిగా చేసిన ఇందిరాగాంధీలను ఈ విశిష్ట పౌరపురస్కారంతో గౌరవించారు. ఇంజనీరింగ్‌లో మోక్షగుండం విశ్వేశ్వరయ్య, హిందూస్థానీ సంగీత శిఖరాన్నధిరోహించిన పండిట్ భీమసేన్‌జోషీ, శాస్త్ర-సాంకేతిక రంగంలో ఆరితేరిన సిఎన్‌రావు, క్రీడారంగంలో సచిన్ టెండూల్కర్‌లకు భారతరత్న పురస్కారం ప్రధానం చేయటం జరిగింది.

1948లో అన్ని రంగాలలోను అంకితభావంతో సేవలు చేసి దేశగౌరవాన్ని, ప్రతిష్టను ఉన్నత దశలోనికి తీసుకెళ్లినవారికి పురస్కారాలతో సన్మానించాలని కేంద్రప్రభుత్వం తలపెట్టింది. అన్ని పురస్కారాలలోనూ తలమానికగా నిలిచి దేశ ప్రతిష్టను ఇనుమడింపచేసే, ప్రధమ గౌరవ పౌర పురస్కారం 'భారతరత్న' గా గుర్తించబడింది. ఈ పురస్కారం ప్రధమంగా విదేశీయుడైన సరిహద్దు గాంధీగా పేరుగడించిన ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్‌కు ఇవ్వబడింది. అప్పటికే అతని జన్మస్థానం దేశ విభజనలో పాకిస్థాన్‌లోనికి వెళ్లింది. రెండవ పురస్కార గ్రహీత డిసెంబర్ 2013లో అస్తమించిన ఆఫ్రికా నల్లసూరీడు నెల్సన్ మండేలా. రాజకీయ రంగంలో బాబూ రాజేంద్రప్రసాద్, మనదేశ ప్రధానిగా చేసిన ఇందిరాగాంధీలను ఈ విశిష్ట పౌరపురస్కారంతో గౌరవించారు. ఇంజనీరింగ్‌లో మోక్షగుండం విశ్వేశ్వరయ్య, హిందూస్థానీ సంగీత శిఖరాన్నధిరోహించిన పండిట్ భీమసేన్‌జోషీ, శాస్త్ర-సాంకేతిక రంగంలో ఆరితేరిన సిఎస్‌రావు, క్రీడారంగంలో సచిన్ టెండూల్కర్‌లకు భారతరత్న పురస్కారం ప్రధానం చేయటం జరిగింది.



దేశ రక్షణను భుజస్కంధాలపై మోసే సైనికరంగం సేవలను దేనితోను ప్రామాణికంగా పోల్చలేము. అసమాన ధైర్య సాహసాలతోపాటు, సమయస్ఫూర్తిని, పోరాట పటిమను ప్రదర్శించినవారికి సైన్యంలో 'పరమవీరచక్ర' బిరుదుతో ఘనంగా సత్కరిస్తారు. దీనిని పొందటానికి ప్రతి సైనికుడు, సైనికాధికారి ప్రయత్నిస్తారు. ప్రధమంగా 'పరమ వీరచక్రాన్ని' పొందిన వీరుడు మేజర్ సోమనాధశర్మ.

ప్రతిష్టాత్మక పరమవీరచక్ర రూపశిల్పి ఒక మహిళ. ఆమే సావిత్రీబాయి ఖనోల్కర్. ఈమె మనదేశంలో పుట్టలేదు. స్విట్జర్లాండులోని న్యూసాటిల్‌లో 20-7-1913లో జన్మించింది. పిన్న వయసులోనే తల్లి ప్రేమకు దూరమయింది. వయసుతోపాటు ఆమెలో ఆధ్యాత్మిక భావాల అంకురార్పణ జరిగి దినదినాభివృద్ధి చెందాయి. విదేశాల పర్యటన ప్రారంభించింది. ఏ దేశంలోను స్థిరపడాలనిపించలేదు. చివరకు భారత్‌కు వచ్చారు. ఆమె అసలు పేరు ఇవానోసాన్. ఇవానోసాన్‌కు భారత్‌లో వుండి పోవాలనిపించింది. స్థిరపడ్డారు. సంస్కృతం, హిందీ,



మరాఠీ భాషలను నేర్చుకొని వాటిని అవపోసన పట్టారు. అందులో ప్రావీణ్యత సాధించారు. విక్రమ్‌ఖనోల్కర్ మహారాష్ట్రీయుడు. ఇంగ్లండులోని సాండ్‌హార్ట్‌లో సైనిక శిక్షణ పొందిన సైనికాధికారి. ఇవానోసాస్‌కు విక్రమ్‌తో పరిచయం ఏర్పడింది. ఇరువురూ దంపతులవాలనుకున్నారు. 1929లో వివాహం జరిగింది. లక్నోలో స్థిరపడ్డారు. వివాహానంతరం ఆమె తన వేషధారణను మార్చుకుంది. భారతీయ మహిళగా మారి పేరు కూడా మార్చుకుని సావిత్రిబాయి ఖనోల్కర్‌గా పిలవబడింది.

మేజర్ విక్రమ్, మేజర్ అటల్ ఆమె ప్రాణస్నేహితులు. అటల్ తరచు విక్రమ్ ఇంటికి వస్తూ వుండేవారు. భారత ప్రభుత్వం సైనిక రంగంలో యివ్వతలపెట్టిన 'పరమవీరచక్ర' రూపకల్పన నిర్వహణ మేజర్ అటల్‌కు అప్పజెప్పింది. అప్పటినుంచి మేజర్ విక్రమ్ ఇంటిలో ముగ్గురూ కలిసి దీని రూపకల్పనపై చర్చోపచర్చలు చేసేవారు. 'పరమవీరచక్ర' రూపురేఖలు భారతీయ సంస్కృతి - సంప్రదాయాలను ప్రతిబింబించేలాగా వుండాలని కూడా భారత ప్రభుత్వం తెలియజేసింది. సావిత్రిబాయికి మన భారత పురాణ ఇతిహాసాలు కొట్టినపిండి. ఆమె వీటినన్నిటిని అంతకుముందే లోతుగా అధ్యయనం చేసివున్నారు. ఆమెకు మహర్షి దధీచి గుర్తుకొచ్చాడు. వృత్తాసుర రాక్షసుడుని హతమార్చటానికి దధీచి తన వెన్నుముకను ఆయుధంగా చేసుకొమ్మని చెప్పి దేవతలకు దానమిస్తాడు. ఆ వెన్నుముకే వజ్రాయుధంగా ఉపయోగపడిందన్న సంగతి సావిత్రిబాయికి గుర్తుకొచ్చింది. ఆ వెన్నుముకే అద్భుతమైన త్యాగానికి, పౌరుషానికి, అజేయశక్తికి ప్రతీక అని భావించారామె. ఆ సంగతే మిత్రుడు అటల్‌కు చెప్పారు. నిరంతర పరిశోధకురాలయిన సావిత్రిబాయి టిబెట్‌లో లభించిన వజ్రాయుధాన్ని పరిశీలించారు. భవానీమాత ఛత్రపతి శివాజీకి అనుగ్రహించిన ఖడ్గంకూడ ఆమె ఆలోచనలోకి వచ్చింది. నాలుగు వజ్రాయుధాలు, ఇరు వైపుల భవాని ఖడ్గాలు, మధ్యలో అశోక చక్రంలో 'పరమవీరచక్ర' ఆమె చేతుల్లో రూపు దాల్చింది. దానిని భారత ప్రభుత్వం ఆమోదించింది. 'పరమవీరచక్ర' రాగితో తయారు చేయబడుతుంది. సైనిక చరిత్రలో పరమవీరచక్ర రూపశిల్పిగా చరిత్రకెక్కారు. ప్రతిష్టాత్మకమైన అ బహుమతి ఉన్నంత కాలం సావిత్రిబాయి ఖనోల్కర్ పేరు చిరకాలం ఉంటుంది. 1952లో విక్రమ్ ఖనోల్కర్ మరణించారు. ఆమె 'సెయింట్ ఆఫ్ మహారాష్ట్ర' గ్రంథం రచించారు. భారతీయ విద్యాభవన్ వారు ప్రచురించారు. భర్త మరణానంతరం రామకృష్ణ సేవాశ్రమంలో చేరి సేవాకార్యక్రమాలలో పాల్గొనేవారు. దేశ విభజన సమయంలో మహిళా శరణార్థుల కోసం శిబిరాలను నెలకొల్పి శరణార్థులను ఆదుకున్నారు. 1967లో నిద్రలోనే ఆ రూపశిల్పి తుదిశ్వాస విడిచారు. పట్టుదలతో శ్రమిస్తే మహిళలు మేధావులుగా రాణిస్తారని సావిత్రిబాయి నిరూపించారు.

మహిళలు, యువకులు అన్ని రంగాలలోను ప్రవేశించి క్రమశిక్షణతో అంకితభావంతో, నియమబద్ధంగా పని చేస్తున్నారన్నది అక్షర సత్యం. అయినా సమాజంలో పురుషులకున్న వెసులుబాటు, విన్నరించటానికున్న అవకాశాలు మహిళలకు లేవన్నది కూడ పరమసత్యం. 33% రిజర్వేషన్ బిల్లు ఇంతవరకు ఆమోదం మరియు అమలుకు నోచుకోలేదు. తమ అధికారాలతోపాటు, తమ సంఖ్య కూడ తగ్గిపోతుందన్న భయంతో వెనక్కు నెట్టివేయటానికి ప్రయత్నించేవారు లేకపోలేదు. అయినా మహిళలు నిరాశ చెందలేదు. కొన్నివేల సంవత్సరాల పురుషాధిక్య భావజాలం నుండి బయటపడి మన ఉనికిని కాపాడుకోవటానికి పోరాడవలసి వస్తుంది. ఉన్న పళంగా ఒకేసారి పూర్తి స్థాయిలో మార్పు జరగటమన్నది అసాధ్యం. అయినా అధైర్య పడవద్దు. సాధికారిత అన్నిరంగాలలోనూ సాధించాలి. భార్యలను పక్కన బెట్టి ఆ స్థానంలో భర్తలు అధికారం చెలాయించని దిశగా ముందుకు నడవాలి. ●

## నిర్లక్ష్యం నీడలో మాతృవేదన

నాలోనే ఊపిరి పోసుకున్నావు
నా ఊపిరితోనే శ్వాస తీసుకున్నావు
నీ శ్రేయస్సు కోసం
నా ఆహార విహారాలేకాదు
ఇష్టాలన్నీ వదులుకున్నాను
అందమైన ఆకృతిలో ఒడిని చేరే నీకోసం
కష్టాలన్నీ ఇష్టంగానే స్వీకరించాను!

నీ బుడి బుడి నడకలకు మురిసిపోయాను
గలగల మాటలకు ఉప్పొంగిపోయాను
నా ఒడిలో వడివడిగా పెరిగిన నువ్వు
నాకంటే ఎత్తు పెరిగితే పరవశించాను
పండుగలు చేశాను కదరా నాన్నా !!

నీ కంటికి నేనే రెప్పగా
నీ మాటకు నేనే వాణిగా
చదువుల వేళ తొలిగురువుగా
ఆశయాల సాధనకు ఆలంబనగా
నే.... నిలిచాను కదరా నాన్నా !!

వడివడిగా కీర్తి శిఖరాలనధిరోహించే నీకు
నా రక్తాన్ని పంచి ఇవ్వగలిగాను
నా శ్వాసతో ఊపిరినందించగలిగాను

కానీ-
నాతో ఆలోచనలను పంచుకొని
నన్నూ- ప్రేమించి గౌరవించే
'భావన' నీ కివ్వడం మరచిపోయాను
ఎదిగిన నీకు-
నా ఇష్టాలన్నీ
నీ కష్టాలవుతాయని నీ భావన
రెక్కలు మొలచి పక్షిలా
నువ్వు ఎగిరి పోతున్నావు పైపైకి
నేను మిగిలాను-
రెక్కలు తెగిన పక్షి నయ్యానే
భావనలో-

- దుర్గాప్రసన్న

పరిచయం

# మరో అమ్మ
# మేరీజోన్స్ ఆత్మకథ



కార్మికోద్యమ చరిత్రలో మహోన్నత శిఖరాలనధిష్టించిన నేత మదర్‌జోన్స్ ఒక సాధారణ స్త్రీ ఒక అసాధారణ నాయకురాలిగా, కార్మికుల ఆరాధ్య దేవతగా మారిన విధం ఈ పుస్తకంలో మనకు కన్పిస్తుంది. ఆమె ఆత్మకథ తెలుగు పాఠకులకు ధారావాహికగా అందిస్తున్నామని తెలియజేస్తున్నాము.

– బి.వి. రాఘవులు

మదర్‌జోన్స్ ఆత్మకథ ఆలస్యంగానైనా తెలుగులో రావడం సంతోషించదగిన విషయం. నేడు రాష్ట్రంలో కార్మికోద్యమం ఎదుర్కొంటున్న సవాళ్ళను అర్థం చేసుకోవడానికి, ఆటంకాలను అధిగమించి ఉద్యమాన్ని ముందుకు తీసుకుపోవడానికి కార్మిక నాయకులకు, కార్యకర్తలకు మదర్‌జోన్స్ జీవితానుభవాలు ఎంతగానో తోడ్పడతాయి. కార్మికోద్యమాన్ని, సంఘటిత శక్తిని బలహీనం చేయడానికి పాలకవర్గాలు, ప్రభుత్వాలు చేస్తున్న దాడిని ఎలా ఎదుర్కోవాలో, ఉద్యమాన్ని ఎలా ముందుకు తీసుకుపోవాలో అని సతమతమవుతున్న సంఘాలకు, కార్యకర్తలకు మదర్ జోన్స్ కృషి మార్గదర్శకం కాగలదు. శ్రామిక రాజ్యం గురించి, కార్మికోద్యమం గురించి ఆలోచించే వారెవరైనా అనుసరించాల్సిన, అనుకరించాల్సిన, నేర్చుకోవాల్సిన జీవితం ఆమెది.

మదర్‌జోన్స్ జీవించిన కాలం 1830-1930. పుట్టింది ఐర్లాండ్ దేశంలోనైనా జీవితాంతం గడిపింది అమెరికాలో. జోన్స్ జీవించిన కాలం అమెరికా దేశ చరిత్రలో, అమెరికా కార్మికోద్యమంలో ఒక చారిత్రాత్మక దశ. అమెరికా గుత్తపెట్టుబడిదారీ వ్యవస్థకు పునాది పడిన ఆ కాలానికి, సరళీకరణ విధానాల ప్రవేశంతో ఇండియాలో స్వదేశీ, విదేశీ గుత్తపెట్టుబడిదారుల ఉక్కు పిడికిలి బిగుసుకున్న ఈ కాలానికి కొన్ని వ్యత్యాసాలున్నా అనేక సారూప్యతలున్నాయి. ఆ సారూప్యతల్లో ముఖ్యమైనవి క్రూరమైన శ్రమ దోపిడీ, కార్మికోద్యమ అణచివేత.

మదర్‌జోన్స్ జీవించిన శతాబ్ద కాలం అమెరికా చరిత్రలో "గిల్టెడ్ యుగం"గా పేరుగాంచింది. ఈ కాలంలో ఐరోపా నుండి పెట్టుబడులు భారీగా వచ్చాయి. పారిశ్రామికీకరణ వేగంగా జరిగింది. రైలుమార్గాలు ప్రైవేటు కంపెనీల ఆధ్వర్యంలో వేగంగా విస్తరించాయి. బొగ్గు, స్టీలు, ఆయిల్, చక్కెర, మాంసం, యంత్ర నిర్మాణ రంగాలలో కార్పొరేషన్లు, ట్రస్టుల ఆధ్వర్యంలో పెద్దపెద్ద పెట్టుబడిదారులు ఆవిర్భవించారు. ఈ రోజుకీ మనం వింటున్న రాక్‌ఫెల్లర్, మెల్లాన్, కార్నీచ్, మోర్గాన్, స్టాన్‌ఫోర్డ్, వాండర్‌వెల్ట్ వంటి పేర్లన్నీ ఆనాడు సామాన్య ప్రజలు "రాబర్‌బేరన్స్"గా ఈసడించుకున్న పెట్టుబడిదారులవే.

ఒకవైపున కొద్దిమంది సంపన్నులు సిరిసంపదలతో, విలాసాల్లో మునిగి తేలుతుంటే మరోవైపున అత్యధిక శ్రామిక ప్రజలు గర్భదరిద్రంలో మగ్గుతుండేవారు. క్రూరమైన దోపిడి జరిగేది. జంతువుల కన్నా హీనంగా దుర్భరమైన పరిస్థితుల్లో కార్మికులు పని చేసేవారు. ఫ్యాక్టరీల్లో కార్మికులు రోజుకు 15 గంటలు వెట్టిచాకిరీ చేసేవారు. పిల్లలు, స్త్రీల శ్రమను అమానుషంగా దోచుకునేవారు. రాజ్యం, ప్రభుత్వం, కోర్టులు యజమానుల కొమ్ముకాసేవి. కార్మికులను అణచిపెట్టేందుకు కిరాయి సాయుధ దుండగులను, సైన్యాన్ని వినియోగించడం, హత్యలు చేయడం నిత్యకృత్యం. కోట్లాది మంది ఇతర దేశాల నుండి వలస వచ్చిన ప్రజలతో పట్టణాల్లో మురికి వాడలు కిక్కిరిసిపోయాయి. అంతులేని అవినీతి, అక్రమాలు, సామాజిక అశాంతి పెచ్చరిల్లాయి. మాఫియా గ్యాంగులు సమాంతర రాజ్యాన్ని నడిపాయి. ప్రమాదాల్లో వికలాంగులయ్యేవారు, అల్పాయుష్షుతో మరణించేవారు, అంటువ్యాధులకు బలయ్యేవారు అత్యధికులు.

ఇటువంటి దుర్భర పరిస్థితుల నుండి, దోపిడీ నుండి ఉపశమనం

ఆమె పాల్గొన్న ప్రతి పోరాటంలో మహిళలు ముందుపీఠిన వున్నారు. ముఖ్యంగా సమ్మె ద్రోహులను అరికట్టడంలో, నిర్బంధాన్ని ఎదుర్కోవడంలో మహిళలెంతో చెయ్యగలరని అర్థమవుతుంది. చీపురు కట్టల దళాలంటే ఆనాడు సమ్మె విచ్ఛిన్నకులకు హడలెత్తేది. మహిళలను చెడగొడుతున్నదని, రోడ్లపైకి లాగుతున్నదని, స్త్రీత్వాన్ని నాశనం చేస్తున్నదని జోన్స్‌పై తీవ్రంగా దుష్ప్రచారం చేశారు. ఇటువంటి ప్రచారానికి కొంతమంది కార్మిక నాయకులమనుకునే వారూ ఒడిగట్టారు. వీరందరికీ జోన్స్ ఒకే సమాధానం చెప్పింది. ప్రత్యేకంగా స్త్రీత్వం (Ladyness) అంటూ ఏమీలేదని, అది స్త్రీలను క్లబ్బులకు, వంటగదికి పరిమితం చెయ్యడానికి దోపిడీ సమాజం సృష్టించిన భావమేనని చెప్పి విమర్శకుల నోళ్లు మూయించింది.

పొందేందుకు కార్మికులు, శ్రామికులు క్రమేణా సంఘటితం కావడం ఈ కాలంలో ప్రారంభమైంది. ఎక్కడికక్కడ కార్మిక సంఘాలు, సహకార సంఘాలు ఆవిర్భవించాయి. ఐరోపా ఖండం నుండి వలసవచ్చిన వారిలో కార్మికోద్యమంతో సోషలిస్టు భావాలతో ప్రభావితమైన కొంత మంది ఎక్కడికక్కడ సంఘాలను ఏర్పరిచారు. వాటి ఆధ్వర్యంలో అనేక సమ్మె పోరాటాలు జరిగాయి. 1873,1883లలో వచ్చిన రెండు ఆర్థిక మాంద్యాలు శ్రామికుల పరిస్థితిని మరింత దిగజార్చాయి. కార్మికోద్యమంలో సమరశీలతను పెంచాయి. ఈ కాలంలో నైట్స్ ఆఫ్ లేబర్ (knights of Labour) అన్న సంస్థ కార్మికవర్గాన్ని సంఘటితం చేయడంలో మంచి కృషి చేసింది. ఈ సంస్థలోనే కార్మిక సంఘం కార్యకర్తగా మేరీజోన్స్ కృషి ప్రారంభమైంది. ఈ కాలంలో అమెరికాలో కార్మికోద్యమంలో గొప్ప ప్రభావం చూపించిన పెద్ద రైల్వే సమ్మె 1877లో జరిగింది. ప్రపంచవ్యాపితంగా ప్రసిద్ధిగాంచిన మేడే ఘటన 1886లో చికాగో హే మార్కెట్లో జరిగింది. ఈ సంఘటనను ఆసరా చేసుకొని అప్పుడప్పుడే వేళ్ళూనుకుంటున్న కార్మికోద్యమాన్ని పాలకులు తీవ్ర నిర్బంధంతో అణిచివేశారు. పర్యవసానంగా నైట్స్ ఆఫ్ లేబర్ సంస్థ క్రమేణా కనుమరుగైపోయింది. అయినా కార్మికోద్యమ అభివృద్ధి కొనసాగింది. 1881,1905 మధ్యకాలంలో అమెరికాలో 37000 సమ్మెలు జరిగాయి. 1894లో పుల్‌మేన్ సమ్మెగా పేరుగాంచిన రైల్వే సమ్మె అమెరికన్ రైల్వే యూనియన్ ఆధ్వర్యంలో జరిగింది. ఆఖరుకు సైన్యాన్ని తెచ్చి అణిచివేసినా కార్మికోద్యమాన్ని బలహీనం చేయడానికి పాలకులకు సాధ్యపడలేదు. విడి విడి ఉద్యమాలను ఐక్య పరిచేందుకు వేదికగా 1886వ సంవత్సరంలో అమెరికన్ ఫెడరేషన్ ఆఫ్ లేబర్ ఏర్పడింది.

....

ఈ కల్లోలిత పరిస్థితుల మధ్య, పల్లుబుకుతున్న కార్మికపోరాటాల మధ్య మదర్‌జోన్స్ ప్రజా జీవితం సాగించింది. కార్మిక సంఘ కార్యకలాపాల్లో చురుకుగా పాల్గొనే భర్త ద్వారా ఉద్యమాల గురించి తెలుసుకున్నది. దర్జీ వృత్తిలో భాగంగా సంపన్నుల సోమరితనాన్ని, విచ్చలవిడి విలాస జీవితాన్ని గమనించి ఏవగించుకున్నది. భర్త నలుగురు పిల్లలు ఒకేసారి అంటువ్యాధితో మరణించిన విషాదాన్ని తట్టుకొని నిలబడింది. కష్టపడి అభివృద్ధి చేసుకున్న దర్జీ దుకాణం 1874లో జరిగిన చికాగో అగ్ని ప్రమాదంలో ఆహుతి అయి దిక్కులేనిదయినా మనోనిబ్బరం కోల్పోలేదు. అప్పటికే చికాగో శ్రామిక సమావేశాల్లో పాల్గొని ఉద్యమ భావాలు ఒంటబట్టించుకున్న జోన్స్ కార్మిక సంఘ కార్యకర్తగా మారింది. ఆనాటి నుండి వెనుదిరిగి చూడకుండా ఐదు దశాబ్దాలకు పైగా సంఘ కార్యకర్తగా కార్మికోద్యమానికి అంకితమయ్యింది. అమెరికా కార్మికులకు నాయకత్వం వహించిన ప్రముఖ సంస్థలైన యునైటెడ్ మైన్‌వర్కర్స్ ఫెడరేషన్, ఇండస్ట్రియల్ వర్కర్స్ వరల్డ్ వంటి సంస్థల నిర్మాణంలో భాగస్వామి అయ్యింది.

జోన్స్ నూటికి నూరుపాళ్ళు పోరాట యోధురాలు. ఒక సమావేశంలో జోన్స్ గురించి పరిచయం చేస్తూ ఆమెను మానవతావాదిగా సంబోధించినపుడు "నేను మానవతావాదిని కాదు. నేను ఉద్యమవాదిని'' అని ప్రకటించి పోరాటాలను, ఉద్యమాలను నిర్మించడానికే జీవితాన్నంతటిని వెచ్చించింది. గని కార్మికుల దుర్భర పరిస్థితులకు వ్యతిరేకంగా ప్రాణాలకు తెగించి పోరాడింది. పెన్సిల్వేనియా, పశ్చిమవర్జీనియా, కొలరాడో గని కార్మికుల పోరాటాల్లో ముఖ్య పాత్ర వహించింది. ఆత్మకథలో జోన్స్ పాల్గొన్న ఇంకా అనేక ఉద్యమాల వివరాలున్నాయి.

పోరాటాల్లో మహిళలు, కుటుంబాలు నిర్వహించగల కీలక పాత్రను గుర్తించి, వారిని కదిలించేందుకు నిరంతరం కృషి చేసింది. ఆమె పాల్గొన్న ప్రతి పోరాటంలో మహిళలు ముందుపీఠిన వున్నారు. ముఖ్యంగా సమ్మె ద్రోహులను అరికట్టడంలో, నిర్బంధాన్ని ఎదుర్కోవడంలో మహిళలెంతో చెయ్యగలరని అర్థమవుతుంది. చీపురు కట్టల దళాలంటే ఆనాడు సమ్మె విచ్ఛిన్నకులకు హడలెత్తేది. మహిళలను చెడగొడుతున్నదని, రోడ్లపైకి లాగుతున్నదని, స్త్రీత్వాన్ని నాశనం చేస్తున్నదని జోన్స్‌పై తీవ్రంగా దుష్ప్రచారం చేశారు. ఇటువంటి ప్రచారానికి కొంతమంది కార్మిక నాయకులమనుకునే వారూ ఒడిగట్టారు. వీరందరికీ జోన్స్ ఒకే సమాధానం చెప్పింది. ప్రత్యేకంగా స్త్రీత్వం (Ladyness) అంటూ ఏమీలేదని, అది స్త్రీలను క్లబ్బులకు, వంటగదికి పరిమితం చెయ్యడానికి దోపిడీ సమాజం సృష్టించిన భావమేనని చెప్పి విమర్శకుల నోళ్లు మూయించింది. అయితే వర్గపోరాటాల్లో, సమ్మెలలో స్త్రీల పాత్రను జోన్స్ నొక్కి చెప్పింది. కార్మిక పోరాటాలలో స్త్రీల పాత్రను బలహీన పరుస్తుందని భావించి మహిళల ఓటుహక్కు ఉద్యమాన్ని ఉపేక్షించిందన్న విమర్శకు ఆమె గురైంది.

పెట్టుబడిదారులు లాభాల కోసం పసి పిల్లలతో వెట్టి చాకిరీ చేయించుకుంటూ లేత వయసులోనే వారి జీవితాలను నాశనం చేస్తున్న దుర్మార్గానికి వ్యతిరేకంగా జోన్స్ పోరాటం చేసింది. ఆనాడు చిన్నపిల్లలు వారానికి 60గంటలు పనిచేసేవారు. ముఖ్యంగా బట్టల మిల్లుల్లో చిన్నపిల్లలను విస్తారంగా వినియోగించేవారు. యజమానుల దుర్మార్గాలను సమాజం ముందు బట్టబయలు చేయడానికి 1903లో 200 మంది పిల్లలతో ఫిలడెల్ఫియా నుండి న్యూయార్క్‌లోని అధ్యక్షుడు థియోడార్ రూజ్‌వెల్ట్ ఇంటి వరకు యాత్ర నిర్వహించింది. "మేం గనికి కాదు, బడికి వెళతాం'' అన్న నినాదంతో ప్రచారం నిర్వహించింది. బాల శ్రామికుల దుర్భర జీవితాల పట్ల అమెరికా సమాజంలో స్పృహను కల్గించడంలో కృతకృత్యురాలయింది. బాల కార్మికుల శ్రమను నిషేధించే చట్టాలను గట్టిగా అమలు జరిగేట్టు చేయగల్గింది.

నిరుద్యోగుల ఉద్యమంలోను జోన్స్ ముఖ్యపాత్రను నిర్వహించింది. 1893లో అమెరికా ఆర్థిక వ్యవస్థ తీవ్ర మాంద్యంలో పడినపుడు లక్షల మంది కార్మికులు పని కోల్పోయారు. ఉపాధి దొరకక యువకులు నిరాశా, నిస్పృహలకు గురయ్యారు. ప్రభుత్వం ఉపాధి కల్పనా కార్యక్రమాన్ని చేపట్టాలని అమెరికా నలుమూలల నుండి

ఆమె అద్వితీయమైన ఆందోళన కారిణి. ప్రచారకురాలు. ఆనాటి అమెరికన్ సెనేట్ చర్చలో జోన్స్‌ను "అన్ని ఆందోళనలకు అమ్మమ్మ" అని నిందించారు. దానికి ఆమె అంతకన్నా ఘాటుగా సమాధానం చెప్పింది. "నేను అన్ని ఆందోళనలకు జేజెమ్మగా అయ్యేంత వరకు బ్రతకాలనుకుంటున్నాను" అని చెప్పింది. "నా చిరునామా నా చెప్పుల లాంటిది. అది నాతోనే ప్రయాణం చేస్తుంటుంది." శ్రామికుల జీవితాలను, పని పరిస్థితులను అధ్యయనం చేయడానికి నిరంతరం పర్యటనలు చేస్తుండేది. ఎక్కడ యజమానుల దుర్మార్గాలు ఎక్కువగా వున్నాయంటే అక్కడ ఆఘమేఘాల మీద వాలిపోయేది. ఉద్యమాలకు సహకారం కావాలని ఎవరు కోరినా క్షణాల్లో వారి మధ్య వుండేది. సమ్మె ఎక్కడ ప్రారంభమయినా మద్దతు కూడగట్టేందుకు, సమ్మె ద్రోహులను అడ్డుకునేందుకు నిర్బంధాన్ని ఎదిరించేందుకు, ఆర్థిక దుస్థితిలోనున్న కుటుంబాలను ఆదుకునేందుకు, సహాయంగా విరాళాలను సేకరించేందుకు, క్షతగాత్రులకు వైద్యం అందించేందుకు స్త్రీలు, పిల్లల నైతిక స్థైర్యాన్ని పెంచేందుకు ఆమె అహోరాత్రులు కృషి చేసేది.

40 వేల మందితో నిరుద్యోగులు బైఠాయింపు నిర్వహించారు. ఈ ఉద్యమంలో జోన్స్ క్రియాశీలక పాత్ర నిర్వహించింది.

శ్రామికుల మధ్య జాతి, మత, ప్రాంత, రంగు, లింగ, దేశ భేదాలను సృష్టించి బలహీనపర్చే పాలకుల ఎత్తుగడలను తిప్పికొట్టి కార్మికవర్గ అంతర్జాతీయ ఐక్యతను చాటి చెప్పింది. వలస కార్మికులు, నల్లజాతి కార్మికులను, శ్రామిక మహిళల పట్ల కార్మికోద్యమంలో వ్యక్తమవుతున్న వివక్షను నిరంతరం ప్రతిఘటించింది. నల్లజాతి ప్రజల సమానత్వం కోసం జోన్స్ చేస్తున్న కృషిని చూసి తన కృతజ్ఞతను వ్యక్తం చేయడానికి ఒక నల్లజాతి మహిళ జోన్స్ గౌను అంచును ముద్దుపెట్టుకోవడానికి అనుమతించాలని కోరినపుడు దానికి జోన్స్ "సోదరీ, దుమ్ముకొట్టుకొని ఉన్న అక్కడ (గౌను అంచు) కాదు, (హత్తుకోవాల్సింది) ఇక్కడ నా ఎద మీద. హృదయానికి హృదయం." అని చెప్పిన సమాధానం సామాజిక సమానత్వం పట్ల ఆమెకున్న ప్రగాఢ విశ్వాసాన్ని ప్రతిబింబిస్తుంది. భక్తి పేరుతో కార్మికుల్లో నిష్క్రియాపరత్వాన్ని పెంచుతున్న మతభోధనల ప్రభావాన్ని చాకచక్యంగా ఎదిరించింది. "మరణించిన వారికోసం ప్రార్థించు, బ్రతికున్నవారి కోసం పోరాడు" అని కార్మికులను కర్తవ్యోన్ముఖులను చేసింది.

పెట్టుబడిదారీ వ్యవస్థలో సంపన్నులకు ఒకన్యాయం, పేదలకొక న్యాయం ఎలా ఉంటుందో ఎత్తి చూపింది. జోన్స్ జైలులో ఉన్నపుడు తారసపడిన ఒక ఖైదీతో జరిగిన సంభాషణను ఇలా చెప్పింది. "నువ్వు జైలుకు ఎలా వచ్చావు? అని ఒకసారి ఒక వ్యక్తిని అడిగాను. ఒక జత చెప్పులను దొంగలించినందుకని అతను చెప్పాడు. నువ్వే గనుక ఒక రైలు మార్గాన్ని దొంగతనం చేసి ఉంటే అమెరికా సెనేటర్‌వు అయి ఉండే వాడివని నేను చెప్పాను."

పెట్టుబడిదారీ విధానాన్ని కూలదోస్తేనే దోపిడీ అంతం అవుతుందని నమ్మింది. డబ్బు నాగరికత స్థానంలో ఉదాత్త నాగరికత రావాలని చెప్పింది. సోషలిజాన్ని ప్రచారం చేసింది. మూడవ రాజకీయ పార్టీ కార్మిక, కర్షక పార్టీ స్థాపనలో భాగస్వామయ్యింది. సామాజిక మార్పు కోసం కార్మికులను చైతన్యవంతం చేసేందుకు కృషి చేసింది. కార్మికుల ప్రయోజనాలను ప్రతిబింబించేందుకు "హేతువాద విజ్ఞప్తి" అన్న పత్రికను స్థాపించి నడపడంలో ముఖ్యపాత్ర నిర్వహించింది. "చదవండి, భవిష్యత్ పోరాటాల కోసం నేర్చుకోండి" అంటూ కార్మికులకు విజ్ఞానం అవసరాన్ని నొక్కి చెప్పింది.

ఆమె అత్యంత ప్రమాదకరమైన వ్యక్తిగా సంపన్నులచే ద్వేషించబడింది. 1902 జూన్ లో పశ్చిమ వర్జీనియా గని కార్మికుల సమ్మె సందర్భంగా నిషేధాజ్ఞలను ఉల్లంఘించిందని జోన్స్‌పై కేసు నమోదై విచారణ జరిగింది. ఆ సందర్భంలో ప్రభుత్వ న్యాయవాది రీజ్ గ్లిజార్డ్ ఎదురుగా ఉన్న జోన్స్‌ను చూపిస్తూ "అదిగో అక్కడ అమెరికాలోనే అత్యంత ప్రమాదకరమైన మహిళ కూర్చొని ఉంది... ఒక్క వేలు కదుపుతుంది.... వేల మంది పనిముట్లను పక్కన పడేసి వాకౌట్ చేస్తారు." అని అన్నాడు. యజమానులను వారికి ఊడిగం చేసే ప్రభుత్వాలను, పాలకులను ఎదిరించి ధిక్కరించింది. నిర్బంధానికి భయపడలేదు. తుపాకులకు, దౌర్జన్యానికి లొంగలేదు. జైళ్ళకు వెళ్ళింది. దుష్ప్రచారాన్ని భరించింది. ప్రపంచాన్నే శాసించే కార్పోరేటు యజమానులను సవాలు చేసింది. గవర్నర్లను, దేశాధ్యక్షులను నిలవేయడానికి జంకలేదు. సమ్మె, పోరాటం, అరెస్టు, జైలు – మళ్ళీ – సమ్మె, పోరాటం, అరెస్టు, జైలు – ఇదీ ఆమె జీవితం.

ఆమె అద్వితీయమైన ఆందోళన కారిణి. ప్రచారకురాలు. ఆనాటి అమెరికన్ సెనేట్ చర్చలో జోన్స్‌ను "అన్ని ఆందోళనలకు అమ్మమ్మ" అని నిందించారు. దానికి ఆమె అంతకన్నా ఘాటుగా సమాధానం చెప్పింది. "నేను అన్ని ఆందోళనలకు జేజెమ్మగా అయ్యేంత వరకు బ్రతకాలనుకుంటున్నాను" అని చెప్పింది. "నా చిరునామా నా చెప్పుల లాంటిది. అది నాతోనే ప్రయాణం చేస్తుంటుంది." శ్రామికుల జీవితాలను, పని పరిస్థితులను అధ్యయనం చేయడానికి నిరంతరం పర్యటనలు చేస్తుండేది. ఎక్కడ యజమానుల దుర్మార్గాలు ఎక్కువగా వున్నాయంటే అక్కడ ఆఘమేఘాల మీద వాలిపోయేది. ఉద్యమాలకు సహకారం కావాలని ఎవరు కోరినా క్షణాల్లో వారి మధ్య వుండేది. సమ్మె ఎక్కడ ప్రారంభమయినా మద్దతు కూడగట్టేందుకు, సమ్మె ద్రోహులను అడ్డుకునేందుకు నిర్బంధాన్ని ఎదిరించేందుకు, ఆర్థిక దుస్థితిలోనున్న కుటుంబాలను ఆదుకునేందుకు, సహాయంగా విరాళాలను సేకరించేందుకు, క్షతగాత్రులకు వైద్యం అందించేందుకు స్త్రీలు, పిల్లల నైతిక స్థైర్యాన్ని పెంచేందుకు ఆమె అహోరాత్రులు కృషి చేసేది. జైళ్ళకెళ్ళిన కార్యకర్తల విడుదల కోసం పౌరహక్కుల, మానవహక్కుల రక్షణ కోసం పని చేసింది.

కష్టాల్లో–సుఖాల్లో, జయాల్లో, అపజయాల్లో, ఉద్యమాల్లో, కోర్టుల్లో ఎక్కడైనా, ఎప్పుడైనా జోన్స్ శ్రామికుల మధ్యలో వుండేది. ఆదుకునేందుకు, ఆదరించేందుకు, స్థైర్యాన్నిచ్చేందుకు, అవసరమైన చోటకల్లా వాలి పోయేది.

ఆమె వాక్పటిమ, సూటిదనం, హావభావాలు, నిరాశలోవున్న వారికి సైతం వుత్తేజాన్నిచ్చేవి. ధైర్యసాహసాలు పిరికివారికి సైతం ధైర్యాన్నిచ్చేవి. ఆమె పట్టుదల అపజయంలోను ఆత్మవిశ్వాసం పునరుద్ధరించేది. మరణంలో కూడా కార్మికోద్యమాన్ని ఆమె విడవలేదు. ఇల్లినాయిన్‌లోని గని కార్మికుల శ్మశానవాటికలో విర్టెన్ మృతవీరుల సమాధుల పక్కనే తన సమాధిని ఎంచుకుంది.

జోన్స్ తన జీవిత కాలంలోనే గొప్ప వ్యక్తిగా ప్రఖ్యాతిగాంచింది. అమెరికా శ్రామిక ప్రజల పాలిట దేవతగా ఇంటింటా ఆరాధించబడింది. ఈనాటికీ అమెరికా ప్రజలు ఆమెను మరచిపోలేదు. 1974 సంవత్సరం నుండి 'మదర్‌జోన్స్ మ్యాగజైన్' లక్షలాది చదువరులకు అభ్యుదయ భావాలు ప్రచారం చేస్తుంది.

మొట్టమొదటసారి 1897లో అమెరికా రైల్వే కార్మిక సంఘ కన్వెన్షన్‌లో సంఘ నాయకులు జోన్స్‌ను మదర్ జోన్స్‌గా సంభోధించారు. ఆనాటి నుండి ఆపేరు ఆమెకు స్థిరపడిపోయింది. అమెరికన్ కార్మికవర్గం, కష్టజీవులు ఆమెను తమ అమ్మగానే భావించారు. అమ్మలుగా పిలవబడే అనేక మంది ఇపుడు కూడా ఉన్నారు. కానీ జోన్స్‌కు వారికి ఎంతో తేడా ఉంది. మహిమలు గల మనిషిగా ప్రచారం జరిగినందున అమ్మగా పిలవబడలేదు. సంపన్నుల విరాళాలతో సేవా కార్యక్రమాలు నిర్వహించి అమ్మగా మారలేదు. పేదల జీవితాలతో మమేకమై, పేదల ఉద్యమాలతో పెనవేసుకోవడం ద్వారా వారికి అమ్మ అయ్యింది. గోర్కి నవలలో 'అమ్మ' కలం నుండి ఉద్భవిస్తే "మదర్‌జోన్స్" నిజ జీవితం నుండి ఆవిర్భవించింది. ●

# మల్లాది సుబ్బమ్మగారికి నివాళి




ప్రముఖ స్త్రీవాది, రచయిత అయిన మల్లాది సుబ్బమ్మగారు (90సం॥లు) 15-5-14న కనుమూశారు .ఆమె మృతికి అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం (ఐద్వా) ప్రగాఢ సంతాపాన్ని, కుటుంబ సభ్యులకు సానుభూతిని తెలియజేస్తోంది. వర్తమాన సమాజంలో స్త్రీల హక్కుల గురించీ, స్త్రీ స్వేచ్ఛ గురించి మాట్లాడేటపుడు మల్లాది సుబ్బమ్మ గారి పేరు గుర్తుండనివారుండరు. మల్లాది సుబ్బమ్మగారు దాదాపు నలభై సంవత్సరాలు స్త్రీ స్వేచ్ఛ పత్రికకు సంపాదకురాలిగా ఉన్నారు. మహిళా ఉద్యమ నాయకురాలిగా, సమాజంలోని మూఢాచారాలను వ్యతిరేకించే హేతువాదిగా అనేక రంగాలలో కృషి చేశారు.

1980లో మహిళాభ్యుదయ సంస్థను స్థాపించి సభలు, సమావేశాలు, అధ్యయన శిబిరాలు నిర్వహించి మహిళల్లో చైతన్యం కలిగించటం, కుటుంబ హింసను వెలికితీసి దానిపై స్త్రీలలో అవగాహన కలిగించటం, దోషులు శిక్షింపబడేలా చర్యలు తీసుకునేందుకు మరియు అభ్యుదయ వివాహ వేదికను ఏర్పాటు చేసి వితంతు వివాహాలు, వర్ణాంతర వివాహాలు జరిపించారు. కుటుంబ న్యాయ సలహా కేంద్రం కూడా నడిపారు. ఆమె నేషనల్ హ్యూమన్ రైట్స్ అవార్డు, ఢిల్లీ తెలుగు అకాడమీ నేషనల్ అవార్డు, దుర్గాబాయ్ దేశ్‌ముఖ్ అవార్డు, త్రిపురనేని రామస్వామి అవార్డు, అంబేద్కర్ అవార్డు ఇలా అనేక పురస్కారాలు, అవార్డులు పొందారు.

సంపూర్ణ మద్య నిషేధ ఉద్యమంలో చురుకైన పాత్ర పోషించారు. ఐద్వా ఆధ్వర్యంలో నడుస్తున్న చైతన్య మానవి పత్రికకు కొంతకాలం పాటు వ్యాసాలు ప్రచురణకు పంపడం ద్వారా తమ సహకారాన్ని అందించారు.

"నేను చేసింది ఆవగింజంత" అని నిగర్వంగా చెప్పిన ఆదర్శమూర్తి మల్లాది సుబ్బమ్మగారు. నేడున్న సమాజంలో ఇటువంటి అభ్యుదయ వాదులు, సంస్కరణ వాదుల అవసరం ఎంతైనా ఉంది. సుబ్బమ్మ గారి మృతికి చైతన్య మానవి నివాళులర్పిస్తోంది.

కథ

# 'వెన్నెల'

జి.వి. లక్ష్మి

'సిగ్నల్ యిచ్చినట్టున్నారు రైలు కదులుతుందేమో నేనుంటాను మరి. అమ్మా వెన్నెలా! వస్తాను తల్లీ. జాగ్రత్త" పెద్దాయన మాటలు విని, వంగుని సూట్‌కేస్‌కి చైన్ వేస్తున్న నేను గబుక్కున తలెత్తి చూశాను. ఎదురు బెర్త్‌మీద పదినెల్ల పాపాయిని ఒళ్ళో కూర్చోపెట్టుకుని 'తాతకి బై చెప్పు తల్లీ' అంటూ తన చేత్తో పాపాయి చేతిని పట్టుకుని వూపుతోంది ఓ మధ్యవయస్కురాలు. పాపాయి తెల్లగా, బొద్దుగా, పెద్దపెద్ద కళ్ళతో చూడగానే అందంగా, ముద్దొచ్చేలా వుంది. బహుశ 'వెన్నెల' ఆ పాపాయి పేరయివుంటుందనుకున్నాను. 'వెన్నెల' ఎంత అందమైన పేరు! ఆ పేరంటే నాకు చాలా యిష్టం. ఎంత యిష్టం అంటే వెన్నెల ఎంత అందంగా, ఎంత హాయిగా వుంటుందో అంత యిష్టం. నిజం చెప్పాలంటే ఆ యిష్టం వెనకాల ఓ చిన్న ప్రేమకథ వుంది. వెన్నెల ఒకప్పటి నా ప్రియురాలి పేరు. ఇప్పటికీ నేనామెని ఆరాధిస్తూనే వున్నాను. అందుకే ఆపేరు వినగానే నా మనసులో ఏదో తెలీని అలజడి రేగుతుంది.

నాకు మొదట ఆడపిల్ల పుట్టినప్పుడు దానికి ఆ పేరే పెట్టాలనుకున్నాను. కానీ నా మనసు అంగీకరించ లేదు. అది నా ప్రియురాలి పేరు. నా కూతురికి పెట్టటం సమంజసం కాదనిపించింది.

లగేజంతా సర్దుకోవటం పూర్తయింది. టైం చూస్తే పదయింది. ఎ.సి కంపార్ట్‌మెంట్ కావటంతో అప్పటికే ప్యాసింజర్స్ అంతా లైట్లు ఆర్పేసి, కర్టెన్స్ వేసేసుకుని నిద్రకుపక్రమిస్తున్నారు. నేను కూడా అప్పర్ బెర్త్‌పైకి వెళ్ళి పడుకున్నాను. కళ్ళు మూసుకున్నానే గానీ ఇందాక విన్న 'వెన్నెల' అన్న పిలుపు నా ఆలోచనల్ని పాతికేళ్ళ వెనక్కి తీసుకెళ్ళింది.

అవి నేను ఐ.ఐ.టి ఫైనలియర్ చదువుతున్న రోజులు. సెలవులకని అమ్మానాన్నల దగ్గరికి వైజాగ్ వచ్చాను. పండక్కి తాతయ్య, నాయనమ్మల్ని తీసుకురావటానికి మా వూరు పంపారు నన్ను. ఆ పల్లెటూరు వెళ్ళాలంటేనే నాకు మహాబోర్. తాతయ్య, నానమ్మల్ని తీసుకుని వెంటనే వచ్చేద్దామనుకున్న నన్ను తాతయ్య తనకేవో పనులున్నాయని చెప్పి రెండు రోజులు ఆపేశాడు. నాయనమ్మ నేను వెళ్ళేసరికి పండక్కి పిండి వంటలతో సహా అన్ని సర్దుకుని రెడీగా వుంది.

నాయనమ్మకి నాన్న, అత్త యిద్దరే సంతానం. ఇద్దరూ ఉద్యోగ రీత్యా వైజాగ్‌లోనే సెటిలయిపోయారు. అందుకే నాయనమ్మకి వైజాగ్ ప్రయాణం అంటే అంత ఆనందం. మనుమలతో, మనమరాళ్ళతో ఎంతో హ్యాపీగా గడపచ్చని. కానీ తాతయ్య ప్రయాణం పోస్ట్‌పోన్ చేసేసరికి నానమ్మ కూడా కొంచెం డల్ అయింది. ఇక నా సంగతి సరేసరి. ఆ పల్లెటూళ్ళో టి.వి. నే నాకు టైంపాస్ అయింది. ఏవో ఇంగ్లీషు మూవీస్ చూస్తూ టైంపాస్ చేసేవాణ్ణి.

ఒకరోజు మధ్యాహ్నం తాతయ్య పొలం నుంచి వచ్చాక ముగ్గురం కబుర్లు చెప్పకుంటూ భోజనాలు చేస్తున్నాం. తాతయ్య పల్లెటూర్లో వ్యవసాయం చేస్తున్నాడేగానీ ఆయనకి అన్ని విషయాల్లోనూ మంచి నాలెడ్జ్ వుంది. ఆరోజుల్లోనే తాతయ్య బి.యస్సీ పాసయ్యారట. ప్రస్తుత ఎడ్యుకేషన్ సిస్టమ్ గురించి, ఉద్యోగాల గురించి, పాలిటిక్స్ గురించి తాతయ్య మాట్లాడుతుంటే నాకు చాలా ఆశ్చర్యంగా వుంటుంది. మేమలా కబుర్లు చెప్పకుంటూ లంచ్ చేస్తున్నాం. సరిగ్గా అప్పడే చేతిలో జున్ను గిన్నెతో 'అమ్మమ్మ, అంటూ ప్రత్యక్షమైంది వెన్నెల. పట్టు లంగా-ఓణీ, మోకాళ్ళ దాకా వేలాడుతున్న రెండుజడలు, జడలో నాలుగుమూరల మల్లెపూలు, కాళ్ళకి వెండి పట్టీలు, అచ్చం పల్లెటూరి పిల్లకి ప్రతీకలా వుంది. ఆమె. "అమ్మమ్మ! బస్తీ నుంచి మీ మనమడు వచ్చాడట కదా. అమ్మ ఈ జున్ను యిచ్చి రమ్మంది" అంటూ జున్నుగిన్నె టేబుల్ మీద పెట్టింది. 'వీడేనమ్మా మా మనమడు. మద్రాస్‌లో ఐ.ఐ.టి చేస్తున్నాడు " అన్నాడు తాతయ్య నన్ను పరిచయం చేస్తూనే నా వైపు తలెత్తి చూసేలోపే 'ఓ అలాగా' అని, 'వస్తాను తాతయ్య అమ్మకి జంతికలు చేయటంలో హెల్ప్ చేయాలి" అంటూ వచ్చినంత వేగంగా వెళ్ళిపోయింది.

తాతయ్య పరిచయం చేసినపుడు కనీసం నావంక కూడా చూడకుండా ఆ అమ్మాయి అలా నిర్లక్ష్యంగా వెళ్ళిపోవటం నాకెందుకో చాలా అవమానంగా అనిపించింది. నిజం చెప్పాలంటే తాతయ్య నేను ఐ.ఐ.టి చేస్తున్నానని చెప్పినప్పుడు ఆమె నావంక అబ్బురంగానో, ఆశ్చర్యంగానో చూస్తుందనుకున్నాను. అలా జరగక పోయేసరికి నా యిగో దెబ్బతింది. 'పల్లెటూరి బైతులు వీళ్ళకి చదువువిలువ ఏం తెలుస్తుంది' అనుకున్నాక గానీ నా యిగో

**తాతయ్య పరిచయం చేసినపుడు కనీసం నావంక కూడా చూడకుండా ఆ అమ్మాయి అలా నిర్లక్ష్యంగా వెళ్ళిపోవటం నాకెందుకో చాలా అవమానంగా అనిపించింది. నిజం చెప్పాలంటే తాతయ్య నేను ఐ.ఐ.టి చేస్తున్నానని చెప్పినప్పుడు ఆమె నావంక అబ్బురంగానో, అశ్చర్యంగానో చూస్తుందనుకున్నాను. అలా జరగకపోయేసరికి నా యిగో దెబ్బతింది. 'పల్లెటూరి బైతులు వీళ్ళకి చదువువిలువ ఏం తెలుస్తుంది' అనుకున్నాక గానీ నా యిగో శాటిస్‌ఫై అవలేదు.**

శాటిస్ఫై అవలేదు.

ఆరోజు రాత్రి నాయనమ్మ నా గదిలోకి వచ్చి 'ఒరేయ్ వర్మా! తాతయ్య గుండెల్లో నొప్పి అని బాధపడుతున్నారు రా. ఒకసారి లేచిరా" అంటూ ఖంగారుగా నన్ను నిద్ర లేపింది. తాతయ్య గదిలోకి పరిగెత్తుకెళ్ళాను. తాతయ్య మంచం మీద కూర్చుని ఆయాసపడుతున్నాడు. నన్ను చూడగానే "గుండెల్లో బరువుగా; వెన్ను అంతా నొప్పిగా వుందిరా. గుండె జబ్బేమో అని భయంగా వుంది" అన్నాడు ఖంగారుగా. 'అదేం వుండదులే తాతయ్య. పొలంలో బాగా స్ట్రెయిన్ అయి వుంటావు. పెద్ద వయసు కదా. శరీరం తట్టుకోలేక పోతోంది. అంతే తాతయ్య" అని, 'నాయనమ్మా డాక్టర్‌ని పిలుచుకొస్తాను" అన్నాను. "కోటిగాణ్ణి డాక్టర్ కోసం పంపాకే నిన్ను లేపానురా" అంది నాయనమ్మ.

ఐదు నిమిషాల తర్వాత తలుపు తట్టిన శబ్దం విని గబగబ వెళ్ళి తలుపు తీశాను. ఎదురుగా డాక్టర్‌తో కోటిగాడు నిలబడి వున్నాడు. నోరెళ్ళబెట్టి చూస్తున్న నన్ను "ప్లీజ్ ప్రక్కకి తప్పుకోండి. తాతయ్యని చూడాలి." అంది నైట్‌పాంట్, టీషర్ట్‌లో వున్న వెన్నెల. తాతయ్యని పరీక్షించి "అమ్మమ్మ పండక్కి పిండివంటలు చేసింది కదా అని తెగ తినేసినట్టున్నారు. కొంచెం గ్యాస్ ప్రాబ్లం వచ్చింది. భయపడాల్సిందేమీ లేదు. ప్రస్తుతం ఈ టాబ్లెట్స్ వేసుకోండి. రిలీఫ్ వస్తుంది. ఎలాగూ వైజాగ్ వెళ్తున్నారు కాబట్టి అక్కడ ఈ టెస్ట్‌లన్నీ చేయించుకోండి. ఏమీ లేదనిపించుకుంటే మీకు ధైర్యంగా వుంటుంది." అంటూ ప్రిస్క్రిప్షన్ రాసి నా చేతిలో పెట్టింది. అందరికీ గుడ్‌నైట్ చెప్పి హుందాగా వెళ్ళిపోయింది.

'తాతయ్య ఆ అమ్మాయి డాక్టరా?" ఆశ్చర్యంలోంచి తేరుకుని అడిగాను. "అవునురా వట్టి డాక్టర్‌కాదు. గోల్డ్‌మెడలిస్టు." కళ్ళెగరేస్తూ గర్వంగా చెప్పాడు తాతయ్య. ఆమె గురించి ఏమీ తెలీకుండా మధ్యాహ్నం అలా ఆలోచించినందుకు నిజాయితీగానే

"ఓకే వెన్నెల నేను నీ ఆశయాల్ని, ఆదర్శాలని ఎంతో గౌరవిస్తాను. వాటికి నేనడ్డురాను. నువ్వు నీ గోల్స్ రీచ్ అయ్యాకే మనం పెళ్ళి చేసుకుందాం." ఎంత మామూలుగా చెబుదామనుకున్నా నా గొంతులో ఒకలాంటి అభ్యర్థన స్పష్టంగా ధ్వనించింది.

రియలైజ్ అయ్యాను. మర్నాడు మధ్యాహ్నానికల్లా తాతయ్యకి బాధలన్నీ తగ్గిపోయి నార్మల్ అయిపోయారు. ఆ రాత్రికే మా వైజాగ్ ప్రయాణం. వెళ్ళేముందు ఒక్కసారి వెన్నెలని చూడాలనీ, కలిసి మాట్లాడాలనీ అనిపించింది. తాతయ్య ఆరోగ్యం వంకతో కోటిగాణ్ణి వెంటపెట్టుకుని వాళ్ళింటికి వెళ్ళాను. వాళ్ళ పేరెంట్స్ నేనెవరినో కోటిగాడి ద్వారా తెలుసుకున్నాక నన్నెంతో ఆప్యాయంగా ఆహ్వానించారు. దాదాపు రెండు మూడు గంటలు వెన్నెలతో పిచ్చాపాటి మాట్లాడుతూ గడిపేశాను. ఆ క్షణం నుంచే వెన్నెల నా ఆరాధ్యదేవతగా నా మనసులో స్థిరపడిపోయింది.

సెలవుల తర్వాత వైజాగ్ నుండి మద్రాసుకి తిరిగి వచ్చేశాక తాతయ్య, నాయనమ్మల క్షేమ సమాచారాలు తెలుసుకునే నెపంతో కోటిగాడికి ఫోన్‌చేస్తూ వుండేవాడిని. మాటల మధ్యలో వెన్నెల గురించి అడుగుతూ వుండేవాణ్ణి. కొన్నాళ్ళకి వాడికి కూడా అర్థం అయిపోయింది. నేను ఫోన్ చేస్తోంది వెన్నెల కోసమే అని. వాడు నేను ఫోన్ చేయగానే వెన్నెల గురించి చాలా హుషారుగా, ఉత్సాహంగా చెప్తూ వుండేవాడు.

లాస్ట్‌సెమ్ ముందు ప్రిపరేషన్‌కని వైజాగ్ వచ్చాను. అప్పటికే క్యాంపస్‌లో ఉద్యోగం వచ్చింది. ఆ శుభవార్త స్వయంగా నాయనమ్మకి, తాతయ్యకి చెప్పి, వాళ్ళ ఆశీస్సులు తీసుకునే నెపంతో మావూరు వెళ్ళాను. హాలిడేస్‌కి వెన్నెల కూడా వచ్చిందని కోటిగాడి ద్వారా అంతకు ముందే తెలిసింది. ఈసారి పల్లెటూళ్ళో వారం రోజులున్నా బోరనిపించలేదు. ప్రతిరోజు సాయంత్రం నేను, వెన్నెల కలిసి కబుర్లు చెప్పుకునేవాళ్ళం. మా యిద్దరి మధ్య పుస్తకాలు ,సినిమాలు, సంగీతం, సమాజం, స్నేహితులగురించి యిలా ఎన్నో విషయాలమీద గంటల తరబడి చర్చలు జరిగేవి. అప్పుడే వెన్నెల మీద నాకున్న అభిమానం ఆరాధనగా, ప్రేమగా మారింది. ఆమె వ్యక్తిత్వం ఆమె మాటల్లో స్పష్టమయ్యేది. ఆ వ్యక్తిత్వమే నన్నెంతగానో ఆకర్షించింది.

ఆరోజు సాయంత్రమే వైజాగ్‌కి నా తిరుగుప్రయాణం. అందుకని ఎలాగైనా ఆరోజు సాయంత్రం నా మనసులోని మాటని ఆమెకి చెప్పేయాలనుకున్నాను. ఎలాగో ధైర్యం కూడగట్టుకుని "వెన్నెలా! నిన్నొకటి అడగనా?" అన్నాను. "ష్యూర్ అడుగు" అంది.

'ఐ వాంటు టు మ్యారీ యు." అన్నాను పరీక్షగా ఆమె వంకచూస్తూ.

అది విని ఆమె సిగ్గుపడటమో, ఆలోచనలో పడటమో చేస్తుంది అనుకున్నాను. కానీ మళ్ళీ ఆమె నా అంచనాల్ని తారుమారు చేస్తూ " చూడు వర్మా! మనిద్దరి పరిచయం ఎంతకాలం? జస్ట్ ఎ వీక్. అంతే కదా! మనం పెద్దపెద్ద చదువులు చదివికూడా అందరిలాగానే ఆలోచిస్తే మనచదువులకి అర్థం ఏంటి? నిజానికి పెళ్ళనేది జీవితంలో ఓ పెద్ద మలుపు. బాగా ఆలోచించి తీసుకోవాల్సిన నిర్ణయం అది. మరో ముఖ్యవిషయం, నాకు జీవితంలో కొన్ని గోల్స్ వున్నాయి. అవి సాధించగలగాలంటే నేనిప్పట్లో పెళ్ళి గురించి ఆలోచించకూడదు." అంది చాలా కూల్‌గా.

"ఓకే వెన్నెల నేను నీ ఆశయాల్ని, ఆదర్శాలని ఎంతో గౌరవిస్తాను. వాటికి నేనడ్డురాను. నువ్వు నీ గోల్స్ రీచ్ అయ్యాకే మనం పెళ్ళి చేసుకుందాం." ఎంత మామూలుగా చెబుదామనుకున్నా నా గొంతులో ఒకలాంటి అభ్యర్థన స్పష్టంగా ధ్వనించింది.

**మనసులో ప్రేయసిగా ఊహించుకుంటూ, పైకి స్నేహితుడిలా వుండటం నాకు చేతకాదు. ఆత్మవంచన చేసుకోవటమే అది. అలా నాకిష్టంలేదు. అందుకే, ఆ తర్వాత ఎప్పుడూ ఆమెని కలిసే సాహసం చేయలేకపోయాను. చదువయిపోగానే ఉద్యోగరీత్యా కొద్ది నెల్లకే అబ్రాడ్ వెళ్ళిపోయాను. దానికి తోడు తాతయ్య, నాయనమ్మ కూడా పెద్దవయసుకావటంతో, వూళ్ళో ఒంటరిగా వుండలేక వైజాగ్ వచ్చి నాన్న దగ్గరే సెటిల్ అయిపోయారు. సో, ఆవూరితో వున్న ఆ కొంచెం అనుబంధం కూడా పోయింది.**

'వర్మా నీకు నేను చెప్పింది క్లియర్‌గా అర్థం కాలేదనుకుంటాను. నేననుకున్నది సాధించటానికి పెళ్ళి ఒక్కటే హర్డిల్ కాదు. నీ ప్రేమ కూడా హర్డిలే అవుతుంది. నేనిప్పుడు కమిట్ అయితే భవిష్యత్తులో నేనే అడుగువేయాలన్నా, ఏ నిర్ణయం తీసుకోవాలన్నా నిన్ను, మన భవిష్యత్తుని దృష్టిలో పెట్టుకుని చేయాల్సివుంటుంది. నేను చేసే పనిలో నాకు పూర్తి స్వేచ్ఛ అవసరం. అందుకే ప్రేమ, పెళ్ళి లాంటి విషయాల్ని చాలా దూరంగా వుంచాను. అలా అని జీవితాంతం ఒంటరిగా మాత్రం వుండిపోతానని కాదు. వాటి టైం వచ్చినప్పుడు వాటి గురించి ఆలోచిస్తాను. సారీ! నిన్నేదో తక్కువ చేశానని అనుకోవద్దు. నాకు కూడా నువ్వన్నా, నీ వ్యక్తిత్వమన్నా, నీ అభిరుచులన్నా చాలా యిష్టం. అందుకే నీతో యింత హాయిగా స్నేహం చేయగలిగాను. మనిద్దరం యిలాగే మంచి స్నేహితుల్లా వుండిపోదాం. బహుశా యింత మంచి మిత్రుడు నాకు దొరక్కపోవచ్చు" నావంక ఎంతో అభిమానంగా చూస్తూ చెప్పింది ఆమె.

కానీ మనసులో ప్రేయసిగా ఊహించుకుంటూ, పైకి స్నేహితుడిలా వుండటం నాకు చేతకాదు. ఆత్మవంచన చేసుకోవటమే అది. అలా నాకిష్టంలేదు. అందుకే, ఆ తర్వాత ఎప్పుడూ ఆమెని కలిసే సాహసం చేయలేకపోయాను. చదువయిపోగానే ఉద్యోగరీత్యా కొద్ది నెల్లకే అబ్రాడ్ వెళ్ళిపోయాను. దానికి తోడు తాతయ్య, నాయనమ్మ కూడా పెద్దవయసుకావటంతో, వూళ్ళో ఒంటరిగా వుండలేక వైజాగ్ వచ్చి నాన్న దగ్గరే సెటిల్ అయిపోయారు. సో, ఆవూరితో వున్న ఆ కొంచెం అనుబంధం కూడా పోయింది.

'చాయ్ చాయ్, అన్న కేకతో మెలుకువ వచ్చి టైం చూసుకున్నాను. ఏడున్నరయింది. రాత్రి ఆలోచనల్లో ఎప్పుడు నిద్రపట్టిందో తెలీలేదు నాకు. టీ తాగుదామని బెర్త్‌దిగి వచ్చి క్రింద బెర్త్‌మీద కూర్చున్నాను. ఎదురు బెర్త్‌లో పాపాయి వాళ్ళ అమ్మ ముక్కుతో ఆడుకుంటూ పకపకానవ్వుతోంది. ఆ దృశ్యం ఎంతో చూడముచ్చటగా వుంది.

"మీ పాప పేరు వెన్నెలా?" అని అడిగాను.

"కాదంకుల్ సౌదామిని" చెప్పింది పాప వాళ్ళ అమ్మ.

" మరి వెన్నెల ఎవరి పేరు?" ఆశ్చర్యంగా అడిగాను.

'' నిన్న రాత్రి మీరు ట్రైన్ ఎక్కినప్పుడు మా పాపని ఎత్తుకున్నారే, ఆ ఆంటీ పేరు వెన్నెల. ఆమె ముందు స్టేషన్లో దిగిపోయారు." అంది.

ఎక్కడో చిన్న ఆశ చమక్కుమంది నాలో.

"ఆవిడ మీ బంధువా?" అని అడిగాను.

" ఆవిడ మా వూళ్ళో డాక్టర్. వూళ్ళో అందరికీ బంధువే ఆవిడ. వాళ్ళ స్నేహితులతో కలిసి మా వూళ్ళో పెద్ద హాస్పిటల్ కట్టించారు. చుట్టు ప్రక్కల చాలా వూళ్ళవాళ్ళకి కూడా అక్కడే వైద్యం దొరుకుతోంది. 'అందరూ సిటీలో ప్రాక్టీసు పెట్టి బాగా డబ్బు సంపాదిస్తుంటే, నువ్వు ఈ పల్లెటూళ్ళో ప్రాక్టీసు పెట్టి తక్కువ ఫీజులు తీసుకుంటే నీకేం ఉపయోగం' అని ఎవరైనా అడిగితే 'పుట్టిన వూరికి సేవచేయటానికే నేను చదువుకుంది.' అంటారావిడ. అందుకే డాక్టర్ వెన్నెల అంటే అందరికీ అంత అభిమానం" ఆ మాటలు చెప్పేప్పుడు ఆమె ముఖంలో రవ్వంత గర్వం.

''మీ వూరి పేరేంటి?'' నా గొంతులోని ఆతృత నాకే స్పష్టంగా తెలిసింది.

ఆమె చెప్పింది. అది విన్న నేను షాక్ అయ్యాను అంటే, నిన్న నా ఎదురుగా కూర్చుంది నా ఆరాధ్యదేవత వెన్నెలే అన్నమాట. రాత్రంతా ఆమె నాతో కలిసి ప్రయాణంచేసిందన్న నిజాన్ని నేను నమ్మలేకపోయాను.

"మీ డాక్టర్ గార్కి పెళ్ళయిందా?" నోటి చివరిదాకా వచ్చిన ప్రశ్నని సభ్యత పెదవుల చివరే నొక్కేసింది.

వెన్నెల నన్ను గుర్తుపట్టిందా? గుర్తు పట్టేవుంటుంది. ఆమె చాలా చురుకైంది. తప్పకుండా గుర్తుపట్టివుంటుంది. గుర్తుపట్టివుంటే మరి ఎందుకు పలకరించలేదు.? ఎలా పలకరిస్తుంది? ఆమె స్నేహాన్ని తిరస్కరించి దూరంగా వచ్చేసింది నేనే కదా! ఎంత పొరపాటు చేశాను. రాత్రి ఒక్క ఐదు నిమిషాలు ఆమెవంక పరీక్షగా చూసినా గుర్తుపట్టేవాణ్ణి. చిత్రం ఏంటోగానీ మొదట్నుంచీ ఆమె విషయంలో ప్రతిసారీ నేను పొరపాటు పడుతూనే వున్నాను.

కళ్ళు గట్టిగా మూసుకుని రాత్రి అరక్షణం చూసిన ఆమె ముఖాన్ని గుర్తు తెచ్చుకోవటానికి ప్రయత్నించాను. ఒత్తైన తలకట్టు, నుదుటిన గుండ్రంగా, పెద్దగా వున్న మావిచిగురు రంగు కుంకుమ, పెదవులపై చిరునవ్వు అంతకుమించి ఏమీ గుర్తు రావటంలేదు. ఆ క్షణం నా గుండెల్లో కలిగిన బాధకి భాష్యం చెప్పగలంత భాష నాదగ్గర లేకపోవటంతో మౌనంగా వుండిపోయాను.

# జెండర్‌బడ్జెట్-భారతదేశ అనుభవాలు

## ఐద్వా 10వ జాతీయ మహాసభల కమిషన్ పేపర్ నవంబర్ 2-25, 2014

**భారత రాజ్యాంగం ఆర్టికల్ 15 మరియు 16 ద్వారా మహిళలకు సమాన హక్కులు కల్పించింది. ఓటు హక్కుతోపాటు ఉపాధి హక్కు, స్వేచ్ఛగా సంచరించే హక్కు మరియు అన్ని ప్రాథమిక హక్కులనూ కల్పించింది. దీని అర్థం మనదేశంలోని మహిళలు గౌరవప్రదంగా జీవించడానికీ, పురుషులతో సమానమైన అన్ని అవకాశాలనూ పొందడానికీ చట్టబద్ధంగా పూర్తి హక్కులూ కలిగి వున్నారనేదే.**

జెండర్ అంటే ఏమిటీ?

జెండర్ బడ్జెట్ గురించి చర్చించే ముందు జెండర్ అంటే ఏమిటో వివరించాల్సిన అవసరం వుంది. స్త్రీ పురుషులు, బాలబాలికలు సామాజికంగా, సాంస్కృతికంగా నిర్వహిస్తున్న వారి వారి పాత్రలు, బాధ్యతలు, హక్కులు, సంబంధాలు, ఆకాంక్షలకు సంబంధించిన విషయాల గురించి చెప్పేందుకు జెండర్ అనే పదాన్ని వాడుతాము. ఎందుకంటే? ఈ విషయాలన్నీ సామాజిక నిర్మాణాన్ని బట్టి వుంటాయి. ఈ విషయాలు కాలానుగుణంగా మారనూ వచ్చు, ఒక ప్రదేశానికీ ఇంకో ప్రదేశానికీ భిన్నంగా కూడా వుండవచ్చు.

భారతదేశ సమాజంలో స్త్రీ పురుషులిరువురూ సమాన హోదా కలిగి లేరనేది మనకు తెలిసిన విషయమే. భారత రాజ్యాంగం ఆర్టికల్ 15 మరియు 16 ద్వారా మహిళలకు సమాన హక్కులు కల్పించింది. ఓటు హక్కుతోపాటు ఉపాధి హక్కు, స్వేచ్ఛగా సంచరించే హక్కు మరియు అన్ని ప్రాథమిక హక్కులనూ కల్పించింది. దీని అర్థం మనదేశంలోని మహిళలు గౌరవప్రదంగా జీవించడానికీ, పురుషులతో సమానమైన అన్ని అవకాశాలనూ పొందడానికీ చట్టబద్ధంగా పూర్తి హక్కులూ కలిగి వున్నారనేదే.

కానీ వాస్తవాలు వేరుగా వున్నాయి. 1974 సం॥లో ప్రభుత్వం భారతదేశంలో మహిళల పరిస్థితి (సమానత్వదిశగా) గురించి తెలుసుకోవడానికి ఒక కమిటీ వేసింది. ఆ కమిటీ అప్పుడు ఇచ్చిన నివేదికలోనే భారతదేశంలో అభివృద్ధి సూచికను పరిశీలిస్తే మహిళల్లో ఒక పెద్ద భాగంపై ప్రతికూల ప్రభావం వున్నదనీ, అసమానతలు, మరియు వివక్షత స్పష్టంగా కనిపిస్తున్నాయనీ ఎత్తిచూపింది. 67 సం॥ల స్వాతంత్ర్యం తరువాత ఇప్పుడు కూడా భారతదేశ జనాభాలో 48శాతంగా వున్న మహిళలు ఆరోగ్యం, విద్య, ఉపాధి అవకాశాలు లాంటి దాదాపు అన్ని రంగాలలోనూ పురుషుల కంటే ఎంతో వెనుకబడి వున్నారు. వీరు రెండవ తరగతి పౌరులుగా చూడబడుతున్నారు. 52శాతంపైగా మహిళలు రక్తహీనతతో బాధ పడుతున్నారు. బాలికల లింగ నిష్పత్తి ఇప్పుడు 914కు పడిపోయింది. ప్రసూతి మరణాలు ఇప్పటికీ ఎక్కువగానే నమోదవుతున్నాయి. ఒక లక్ష జననాలకు 212 మరణాలు నమోదవుతున్నాయి.

ఉపాధిలో గ్రామీణ ప్రాంతాల్లో 26శాతం మహిళలుండగా పట్టణ ప్రాంతాల్లో 14శాతం మాత్రమే వున్నారు. 2006 నుండి 2010 సం॥ల మధ్య కాలంలో మహిళలపై హింస 30శాతం పెరిగింది. భారత రాజ్యాంగం మహిళలకు కల్పించిన ప్రాథమిక హక్కులను వారు అనుభవించేటట్లు చూడవలసిన బాధ్యత ప్రభుత్వానికి ఉంది.

మహిళలు సమాన హక్కులు పొందే విధంగా చూడాలని రాజ్యాంగం కొన్ని ప్రత్యేక నిబంధనల ద్వారా ప్రభుత్వాలకు అధికారం కల్పించింది. ఈ బాధ్యతను నెరవేర్చడానికి ప్రభుత్వాలకు అధికారంతోపాటు వనరులు కూడా ఉన్నాయి. కాని ప్రస్తుత ప్రభుత్వాలకు, పాలక వర్గాలకు లింగ సమానత్వం సాధించేందుకు చిత్తశుద్ధిలేదు. భారత దేశంలోని ప్రణాళిక విధానాల ద్వారా మహిళల అభివృద్ధికి ఆటంకంగా ఉన్న అనేక సమస్యలను పరిష్కరించవచ్చు. కాని భారతదేశంలోని విధాన నిర్ణయాలను, ప్రణాళికల చరిత్రనూ పరిశీలిస్తే మొదటి పంచవర్ష ప్రణాళికా కాలంనుండి నేటికీ ప్రభుత్వాలకు లింగ సమానత్వంపై దృష్టి లేకపోవడం కొనసాగుతోంది. కేవలం సంక్షేమ పథకాల లబ్ధిదారులుగా మాత్రమే మహిళలను చూస్తున్నారు. కేవలం ఆడపిల్లల విద్యపైనా మరియు మహిళలకు తల్లులుగా అందాల్సిన సంక్షేమ పథకాలపైనా మాత్రమే ప్రథమ పంచవర్ష ప్రణాళిక నుండి 6వ పంచవర్ష ప్రణాళిక వరకు దృష్టి పెట్టాయి. మహిళలను కేవలం సంక్షేమ పథకాల లబ్ధిదారులుగా మాత్రమే చూడడమంటే భారతదేశంలోని కోట్లాది

**67 సం॥ల స్వాతంత్ర్యం తరువాత ఇప్పుడు కూడా భారతదేశ జనాభాలో 48శాతంగా వున్న మహిళలు ఆరోగ్యం, విద్య, ఉపాధి అవకాశాలు లాంటి దాదాపు అన్ని రంగాలలోనూ పురుషుల కంటే ఎంతో వెనుకబడి వున్నారు. వీరు రెండవ తరగతి పౌరులుగా చూడబడుతున్నారు. 52శాతంపైగా మహిళలు రక్తహీనతతో బాధ పడుతున్నారు. బాలికల లింగ నిష్పత్తి ఇప్పుడు 914కు పడిపోయింది. ప్రసూతి మరణాలు ఇప్పటికీ ఎక్కువగానే నమోదవుతున్నాయి. ఒక లక్ష జననాలకు 212 మరణాలు నమోదవుతున్నాయి.**

**మహిళలను కేవలం సంక్షేమ పథకాల లబ్ధిదారులుగా మాత్రమే చూడడమంటే భారతదేశంలోని కోట్లాది మంది మహిళలు అనేక రంగాలలో అనునిత్యం శ్రమకోర్చి నిర్వహిస్తున్న అనేక రకాల కార్యక్రమాల పట్ల నిర్లక్ష్యం వహించడమే.**

మంది మహిళలు అనేక రంగాలలో అనునిత్యం శ్రమకోర్చి నిర్వహిస్తున్న అనేక రకాల కార్యక్రమాల పట్ల నిర్లక్ష్యం వహించడమే. పురుషులతో సమానంగా ఆర్థిక కార్యకలాపాలు నిర్వహిస్తూ కుటుంబాలకు మరియు సమాజానికి సేవలందిస్తున్న మహిళల పట్ల నిర్లక్ష్యం వహించడమనేది తీవ్రమైన అన్యాయం. మహిళల పట్ల సమాజంలో నెలకొన్న సనాతన పితృస్వామ్య భావజాలం ప్రభావమే ప్రభుత్వ విధానాలలో కూడా కనిపిస్తుందనడంలో ఆశ్చర్యం లేదు.

ఈ సందర్భానుసారమే మనం జెండర్ విషయంలో బాధ్యతాయుతమైన ప్రణాళిక వుండాలనీ మరియు జెండర్ బడ్జెట్ కేటాయింపులు జరగాలనీ చర్చిస్తున్నాము. మహిళల తక్షణావసరాలు తీర్చే చర్యలతోపాటు ప్రస్తుతమున్న అసమాన లింగ బేధాలను రూపుమాపే సరైన విధానాలను చేపట్టడం నేటి ముఖ్యావసరం. సమాజంలో ప్రస్తుతమున్న రకరకాల అసమానతలను దృష్టిలో పెట్టుకొని ప్రభుత్వం ఒక సమగ్రమైన విధానాన్ని రూపొందించాల్సిన అవసరం ఉంది. కాని భారతదేశ పాలకులు నూతన సరళీకరణ విధానాల అమలులో భాగంగా ప్రణాళికా యంత్రాంగాన్ని, బడ్జెట్‌లోనూ కార్పొరేట్ శక్తులకు మరిన్ని రాయితీలు కల్పించడానికే ఉపయోగిస్తున్నారు.

జెండర్ బడ్జెట్ అంటే ఏమిటి?

జెండర్ బడ్జెట్ అంటే మహిళలకు ప్రత్యేకమైన బడ్జెట్ కాదు. సాధారణ బడ్జెట్‌ల నుండి ప్రతిబింబించే ప్రభుత్వ ప్రాధాన్యతలను అంచనా వేయడానికి జెండర్ బడ్జెట్‌ల ద్వారా ప్రయత్నించవచ్చు. సాధారణంగా స్త్రీలు, పురుషులపై బడ్జెట్‌ల ప్రభావం ఎలా వుందో మరియు ప్రత్యేకించి వెనుకబడిన తరగతులకు చెందిన దళితులు, గిరిజనులపై బడ్జెట్ ప్రభావం ఏవిధంగా ఉంటుందో జెండర్ బడ్జెట్‌ల ద్వారా పరిశీలించవచ్చు. జెండర్ బడ్జెట్‌ల దృష్టి కోణం స్త్రీలు మరియు పురుషులకు ఖర్చు పెట్టే డబ్బుకు సంబంధించినది కాదు. కాని బడ్జెట్‌లో కేటాయించే డబ్బు ప్రభావం స్త్రీ పురుషులపై ఏవిధంగా ఉంటుంది మరియు ఆ బడ్జెట్ స్త్రీ పురుషుల అవసరాలకు సరిపడా ఉందా? లేదా? అనే విషయాలకు సంబంధించినది.

ప్రభుత్వ బడ్జెట్‌లు లింగ సమానత్వాన్ని కలిగి ఉండడం లేదు. బడ్జెట్‌లు మహిళల సమానత్వాన్ని పెంచేవిగా ఉండవచ్చు లేదా మహిళల అసమానత్వాన్ని మరింత పెంపొందించేవిగా ఉండవచ్చు. ఇంకో విధంగా చెప్పాలంటే బడ్జెట్‌లు స్త్రీ, పురుషుల మధ్య ఆదాయ అంతరాలను మరియు ఇతర అసమానతలను పెంచేవిగానూ ఉండవచ్చు లేదా తగ్గించేవిగానూ ఉండవచ్చు. ప్రభుత్వం వద్ద ఉన్న అతి ప్రభావవంతమైన విధాన డాక్యుమెంట్లుగా బడ్జెట్‌లను చెప్పుకోవచ్చు. ఎందుకంటే డబ్బు లేకుండా ప్రభుత్వం ఏ విధానాన్ని కానీ కార్యక్రమాన్ని కానీ అమలు చేయలేదు. జెండర్ బడ్జెట్‌లు కేవలం ఖర్చు పెట్టే డబ్బుకు సంబంధించినవే కాదు. బడ్జెట్‌లో ప్రభుత్వ ఆదాయాన్ని కూడా పరిగణనలోకి తీసుకోవాలి. ప్రభుత్వం ఖర్చు పెట్టే డబ్బు ఏ ఆదాయ వనరుల నుండి ఎలా వస్తుంది? మరియు స్త్రీ పురుషులపై బడ్జెట్ అమలు ప్రభావం ఏవిధంగా వుంటుంది అనేది కూడా పరిగణించాలి.

'మహిళా బడ్జెట్‌లు' 'జెండర్ బడ్జెట్‌లు' లింగ స్పృహగల బడ్జెట్‌లు (జెండర్ సెన్సిటివ్ బడ్జెట్‌లు) మరియు జెండర్ రెస్పాన్సివ్ బడ్జెట్‌లు (లింగపర బాధ్యతగల బడ్జెట్‌లు) అనే అన్ని రకాల పదాలనూ జెండర్ అనే కోణంలో జాతీయ, ప్రాంతీయ మరియు స్థానిక స్థాయిలలో బడ్జెట్‌లను విశ్లేషించడానికి ఉపయోగిస్తారు.

**విమర్శనాత్మకమైన తటస్థ జెండర్ బడ్జెట్ విధానం:-**

తటస్థ లేక సాంప్రదాయక జెండర్ బడ్జెట్ విధానంపై ప్రాధమికమైన సైద్ధాంతిక విమర్శ ఏమిటంటే ఈ బడ్జెట్‌లు

**మహిళల తక్షణావసరాలు తీర్చే చర్యలతోపాటు ప్రస్తుతమున్న అసమాన లింగ బేధాలను రూపుమాపే సరైన విధానాలను చేపట్టడం నేటి ముఖ్యావసరం. సమాజంలో ప్రస్తుతమున్న రకరకాల అసమానతలను దృష్టిలో పెట్టుకొని ప్రభుత్వం ఒక సమగ్రమైన విధానాన్ని రూపొందించాల్సిన అవసరం ఉంది. కాని భారతదేశ పాలకులు నూతన సరళీకరణ విధానాల అమలులో భాగంగా ప్రణాళికా యంత్రాంగాన్ని, బడ్జెట్‌లోనూ కార్పొరేట్ శక్తులకు మరిన్ని రాయితీలు కల్పించడానికే ఉపయోగిస్తున్నారు.**

**జెండర్ బడ్జెట్ అంటే ఏమిటి?**

**జెండర్ బడ్జెట్ అంటే మహిళలకు ప్రత్యేకమైన బడ్జెట్ కాదు. సాధారణ బడ్జెట్‌ల నుండి ప్రతిబింబించే ప్రభుత్వ ప్రాధాన్యతలను అంచనా వేయడానికి జెండర్ బడ్జెట్‌ల ద్వారా ప్రయత్నించవచ్చు. సాధారణంగా స్త్రీలు, పురుషులపై బడ్జెట్‌ల ప్రభావం ఎలా వుందో మరియు ప్రత్యేకించి వెనుకబడిన తరగతులకు చెందిన దళితులు, గిరిజనులపై బడ్జెట్ ప్రభావం ఏవిధంగా ఉంటుందో జెండర్ బడ్జెట్‌ల ద్వారా పరిశీలించవచ్చు. జెండర్ బడ్జెట్‌ల దృష్టి కోణం స్త్రీలు మరియు పురుషులకు ఖర్చు పెట్టే డబ్బుకు సంబంధించినది కాదు. కాని బడ్జెట్‌లో కేటాయించే డబ్బు ప్రభావం స్త్రీ పురుషులపై ఏవిధంగా ఉంటుంది మరియు ఆ బడ్జెట్ స్త్రీ పురుషుల అవసరాలకు సరిపడా ఉందా? లేదా? అనే విషయాలకు సంబంధించినది.**

సమాజంలోని పితృస్వామ్య పద్ధతిని మరియు వర్గ పునాదులను మార్చడానికి కావలసిన ఎటువంటి విధానాన్ని కలిగి ఉండడం లేదనేది. అంతేకాక అభివృద్ధి క్రమంలో మహిళలను లబ్దిదారులుగానో, వినియోగదారులుగానో మాత్రమే చూస్తున్నారు. కాని బడ్జెట్ కేటాయింపుల్లో మహిళలకు న్యాయమైన వాటా అందుతుందా లేదా అనేది మనం పరిశీలించాలి. అంతేకాక సమాజంలో మార్పు సాధించాలనీ మహిళలందరికీ విముక్తి కావాలనీ కోరుకునే మహిళా ఉద్యమాలు ఉపాధిలో జరుగుతున్న లైంగిక అసమానతలపైనా మరియు ప్రస్తుత నూతన ఆర్థిక విధానాలపైనా పోరాటాన్ని ఎక్కుపెట్టాల్సి ఉంది. కనుక జెండర్ బడ్జెట్‌ను కేవలం లింగపరమైన స్పృహతో చేసే బడ్జెట్ కేటాయింపులుగా మాత్రమే విశ్లేషించరాదు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల బడ్జెట్ కేటాయింపులు మహిళలను అభివృద్ధి పథంలోకి నడవడానికి నిజంగా సహాయపడుతున్నాయా లేదా అనేది పరిశీలించాలి. తటస్థ జెండర్ బడ్జెట్ విధానం ఇతర రంగాలలో జెండర్‌ను దృష్టిలో పెట్టుకొని చేపట్టాల్సిన చర్యల పట్ల నిర్లక్ష్యం వహిస్తుంది. ఉదాహరణకు మహిళలపై పెరుగుతున్న హింసను అరికట్టే చర్యలు వంటి అంశాలు నిర్లక్ష్యం చేయబడతాయి. బడ్జెట్‌ను విశ్లేషించాల్సిన అవసరం లేదనికానీ, మహిళలు దాని నుండి ఏమి పొందుతున్నారనేది తెలుసుకోవలసిన అవసరం లేదని కాని మన ఉద్దేశ్యంకాదు. ఇందులో రెండు సమస్యలున్నాయి. ఒకటి బడ్జెట్ కేటాయింపులు సరిపడా ఉన్నా అవి పూర్తిగా వినియోగంలోకి రావడం లేదు. **రెండవది:** బడ్జెట్ యొక్క పూర్తి లక్ష్యాన్ని కేవలం ఖర్చుకు సంబంధించిన కేటాయింపుల ద్వారా మాత్రమే అంచనా వేయలేము. ఉదాహరణకు ఒక బడ్జెట్‌లో మహిళల కోసం కేటాయింపులు అత్యధికంగా వుండి వుండవచ్చు. కాని అదే బడ్జెట్

**అభివృద్ధి క్రమంలో మహిళలను లబ్దిదారులుగానో, వినియోగదారులుగానో మాత్రమే చూస్తున్నారు. కాని బడ్జెట్ కేటాయింపుల్లో మహిళలకు న్యాయమైన వాటా అందుతుందా లేదా అనేది మనం పరిశీలించాలి. అంతేకాక సమాజంలో మార్పు సాధించాలనీ మహిళలందరికీ విముక్తి కావాలనీ కోరుకునే మహిళా ఉద్యమాలు ఉపాధిలో జరుగుతున్న లైంగిక అసమానతలపైనా మరియు ప్రస్తుత నూతన ఆర్థిక విధానాలపైనా పోరాటాన్ని ఎక్కుపెట్టాల్సి ఉంది. కనుక జెండర్ బడ్జెట్‌ను కేవలం లింగపరమైన స్పృహతో చేసే బడ్జెట్ కేటాయింపులుగా మాత్రమే విశ్లేషించరాదు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల బడ్జెట్ కేటాయింపులు మహిళలను అభివృద్ధి పథంలోకి నడవడానికి నిజంగా సహాయపడుతున్నాయా లేదా అనేది పరిశీలించాలి.**

పరిధిలోకి వచ్చే మహిళలు ప్రభుత్వ దోపిడీ విధానాల ఫలితంగా ఆకలి, పౌష్టికాహార లోపం, నిరక్షరాస్యత, నిరుద్యోగం లాంటి సమస్యలతో బాధపడుతుంటారు.

కేంద్ర ప్రభుత్వం పెట్టే తటస్థ జెండర్ బడ్జెట్‌లు జెండర్ పట్ల అంధవైఖరిని ప్రదర్శిస్తున్నాయని 2007లోనే ఢిల్లీలోని పబ్లిక్ ఫైనాన్స్ మరియు పాలసీ జాతీయ సంస్థ (ఎన్ఐపిఆర్‌పి) ప్రభుత్వాన్ని హెచ్చరించింది. దేశంలో స్త్రీ పురుషుల మధ్య ఉన్న లింగపరమైన అసమానతలను బడ్జెట్‌లు గుర్తించకపోతే ఆ బడ్జెట్‌ల అమలు ఫలితంగా దేశంలోని స్త్రీ పురుషుల మధ్య మరింత అంతరాలు పెరుగుతాయి.

మైక్రో ఫైనాన్స్ పథకాల ద్వారా మహిళా సాధికారత సాధించాలని 9వ ప్రణాళికా కాలంలో దృష్టి పెట్టారు. కాని భారతీయ మహిళల అభివృద్ధి ఆకాంక్షను అది ఏమాత్రం సాధించలేదు. 11వ పంచవర్ష ప్రణాళికలో మహిళల కోసం కొన్ని ప్రత్యేక పథకాలను ప్రవేశపెట్టారు. "వివిధ రంగాలలో 30 శాతం అభివృద్ధి నిధులను మహిళలకు లబ్ధిచేకూరేలా" కేటాయించాలని కేంద్ర ప్రభుత్వం అభిప్రాయం. కాని రాష్ట్ర ప్రభుత్వాలు ఈ పని చేయడంలేదు. నామమాత్రంగానే నిధులు కేటాయిస్తున్నారు. మహిళల అభివృద్ధి పథకాల కోసం కేటాయించిన నిధులు మహిళల జనాభా శాతానికి సరిపడా లేవు. మహిళలు మన దేశ జనాభాలో 48శాతం ఉన్నారు. కాని ఈ సంఖ్యకు సరిపడా కేటాయింపులు మాత్రం జరగడం లేదు.

1991వ సం॥ నుండి భారత ప్రభుత్వం మార్కెట్ శక్తుల పైననే ఆధారపడుతుంది. దేశ అభివృద్ధిని వాటికి ఫణంగా పెడుతుంది. ప్రభుత్వం క్రమంగా కార్పొరేటీకరణ వైపు ప్రయాణిస్తూ మన ఆర్థిక రంగంలోని కీలక రంగాలలో విదేశీ ప్రైవేటు పెట్టుబడిని ఆహ్వానిస్తుంది. కనుక బడ్జెట్‌లు అభివృద్ధి లక్ష్యానికి దూరమవుతున్న కొలదీ జెండర్ అభివృద్ధి గురించి ఆశించలేము.

**కేంద్ర ప్రభుత్వ జెండర్ బడ్జెట్ విధానంలోని సమస్యలు:**

కేంద్ర ప్రభుత్వ బడ్జెట్‌లో భాగంగా ప్రభుత్వం 2005-06 నుండి జెండర్ బడ్జెట్‌ను ప్రకటిస్తున్నా, అందులో అనేక

**11వ పంచవర్ష ప్రణాళికలో మహిళల కోసం కొన్ని ప్రత్యేక పథకాలను ప్రవేశపెట్టారు. "వివిధ రంగాలలో 30 శాతం అభివృద్ధి నిధులను మహిళలకు లబ్ధిచేకూరేలా" కేటాయించాలని కేంద్ర ప్రభుత్వం అభిప్రాయం. కాని రాష్ట్ర ప్రభుత్వాలు ఈ పని చేయడంలేదు. నామమాత్రంగానే నిధులు కేటాయిస్తున్నారు. మహిళల అభివృద్ధి పథకాల కోసం కేటాయించిన నిధులు మహిళల జనాభా శాతానికి సరిపడా లేవు. మహిళలు మన దేశ జనాభాలో 48శాతం ఉన్నారు. కాని ఈ సంఖ్యకు సరిపడా కేటాయింపులు మాత్రం జరగడం లేదు.**

లోపాలు, వివిధ రకాల సమస్యలూ ఉన్నాయని న్యూఢిల్లీలోని బడ్జెట్ విశ్లేషణా సంస్థ (సిబిజిఎ) ఎత్తి చూపింది. అవి ఈ క్రింది విధంగా ఉన్నాయి.

1. 56 మంత్రిత్వ శాఖలు జెండర్ బడ్జెట్ విభాగాలను ఏర్పర్చినా, అందులో కొన్ని శాఖల వద్ద మాత్రమే వాటి పథకాలకు సంబంధించిన సమగ్ర లెక్కలు ఉన్నాయి. అవి ఖర్చుకు సంబంధించిన కేటాయింపులు ఎంత ఉన్నాయని చూపించడమే తప్ప నిజంగా ఎంత ఖర్చు పెట్టిందీ చూపడం లేదు.

2. ప్రభుత్వం ప్రకటించే బడ్జెట్‌లో మహిళలకు మాత్రమే పరోక్షంగా లబ్ది చేకూర్చుతున్న పథకాలకు సంబంధించిన వనరులను గురించి ప్రస్తావన వుండడం లేదు. అంతేకాక మహిళల జీవనాన్ని మెరుగుపరిచే త్రాగునీరు, పారిశుద్యం పథకాల లాంటి జెఎన్ఎన్‌యుఆర్ఎం పథకాలు ఈ పరిధిలోకి తీసుకోవడం లేదు.

3. ప్రతి సంవత్సరం ప్రభుత్వం నివేదికను ప్రచురిస్తున్నా, పొరపాట్లను ఏవిధంగా దిద్దుకూంటారనే నివేదికను ప్రచురించడం లేదు.

4. మహిళలను లక్ష్యంగా చేసుకొని పెట్టామని చెబుతున్న ఇందిరా ఆవాస్ యోజన లాంటి అనేక పథకాలు నిజంగా వాటి లక్ష్యాలకు అనుగుణంగా లేవు.

5. మహిళలకు సంబంధించిన ప్రత్యేక పథకాలకు ఎంత ఖర్చు పెడుతున్నామనేది మరియు సాధారణ కార్యక్రమాలలో కూడా మహిళా పురోభివృద్ధికి ఎంత కేటాయింపులు చేస్తున్నామనేది ప్రభుత్వం తరపున 2009-10సం॥లో పదిహేడు మంత్రిత్వ శాఖలకు ఒక సర్క్యులర్ రూపంలో విడుదల చేయాల్సి ఉంది. కాని ఆయా శాఖలు దీనిని ముఖ్యమైనదిగా భావించలేదు. 2013 సం॥ గడిచిపోతున్నా ఇప్పటి వరకూ దీనికి సంబంధించిన సమాచారం ఇవ్వలేదు.

6. జెండర్ బడ్జెట్ నివేదికను సమీక్షించే చర్యలు చేపట్టడం లేదు. 2010-11లో 6.2శాతం ఉన్న జెండర్ బడ్జెట్ మొత్తం 2011-12 కాలానికి 5.8శాతానికి తగ్గిపోయింది. 2012-13 సం॥ కాలానికి మాత్రం గత సం॥ కంటే అతి కొద్దిగా 0.1 శాతం పెరిగింది.

7. సామాజికంగా వెనుకబడిన తరగతుల కోసం అందులోని మహిళల కోసం ప్రభుత్వం అనేక పథకాలను ప్రవేశపెట్టింది. కాని వాటి లక్ష్యాలు ఎంతమేరకు నెరవేరాయన్నది మనం పరిశీలించాలి.

2011-12 సం॥లో ప్రభుత్వ జెండర్ బడ్జెట్ నివేదిక ఈ క్రింది విధంగా

| మహిళల కోసం 0% కేటాయింపులు | పథకాల సంఖ్య |
|---|---|
| 0 | 12 |
| 30 | 28 |
| 30 | 70 |
| 100 | 12 |
| 100 | 1 |

వుంది.

ఈ నివేదికలో అనేక పాక్షిక సత్యాలున్నాయి. మహిళలు చాలా సందర్భాలలో తమ యాజమాన్య హక్కులను కూడా వేరేవారికి బదలాయించేలా వత్తిడి చేయబడుతున్నారు.

**కొన్ని ప్రభుత్వ ప్రతిష్టాత్మక పథకాలు:**

మహాత్మాగాంధీ జాతీయ ఉపాధి హామీ పథకం ప్రకారం 1/3వ వంతు మహిళలకు 100 రోజుల పని కల్పిస్తున్నారు. కాని వేతనాలలో లింగ వివక్షత వుంది. దేశంలో 50శాతం మహిళలు లబ్దిదారులుగా వున్నట్లు ప్రభుత్వ అధికారిక లెక్కలలో చూపుతున్నా, ఒక్కో ప్రాంతంలో ఈశాతం ఒక్కో విధంగా వుంది. వేతనాలలో అసమానతలున్నాయి. ఈ విధంగా ఎందుకు జరుగుతుందనేది ప్రభుత్వం వద్ద సమాధానం లేదు. ఎన్.ఎస్.ఎస్.ఒ లెక్కల ప్రకారం పురుషులకు రోజుకూలి 90రూ॥ల 90పైసలుండగా మహిళలకు 87రూ॥లు వున్నది. మహిళలు ఎక్కువమంది పనిలోకి రావడం ఉపాధి అవకాశాలు పెరగడం వల్లనా లేక వారిలో రోజు రోజుకూ పేదరికం పెరగడం కారణమా అనేది పరిశీలించాలి.

గ్రామీణ ప్రాంతాల్లో రోడ్లు, విద్యుత్తు, ఇళ్ళు, మంచినీరు, టెలిఫోన్ మొదలైన సదుపాయాలు కల్పించాలనే ఉద్దేశ్యంతో భారత్ నిర్మాణ్ అనే కార్యక్రమాన్ని చేపట్టారు. ఇది మహిళల ఉపాధినీ, ఆరోగ్యాన్ని కూడా మెరుగు పరచడానికి ఉపయోగపడాల్సివుంది. కాని వాస్తవంగా ఇది జరగడం లేదు.

గ్రామీణ ప్రాంతాల్లో బహిరంగ మల విసర్జనను అరికట్టి అందరికీ పారిశుద్ధ్య సదుపాయాలకోసం సంపూర్ణ పారిశుద్ధ్యం అనే కార్యక్రమం చేపట్టారు. కాని ప్రతి ఇంట్లో మరుగుదొడ్డి సౌకర్యాలు లేక మహిళలు ఇంకా బహిరంగ ప్రదేశాలకే ఎందుకు వెళ్ళాల్సి వస్తుందనేది మనం చూడాలి.

సర్వశిక్ష అభియాన్ బాలికల విద్యపై ప్రత్యేక దృష్టి పెట్టింది. అది స్కూళ్ళలో బాలికల ప్రవేశం పైననే కేంద్రీకరించింది తప్ప వారి భద్రత కొరకు కాని వారి మరుగుదొడ్డి సౌకర్యాలపై కాని దృష్టి పెట్టలేదు.

**గ్రామీణ ప్రాంతాల్లో బహిరంగ మల విసర్జనను అరికట్టి అందరికీ పారిశుద్ధ్య సదుపాయాలకోసం సంపూర్ణ పారిశుద్ధ్యం అనే కార్యక్రమం చేపట్టారు. కాని ప్రతి ఇంట్లో మరుగుదొడ్డి సౌకర్యాలు లేక మహిళలు ఇంకా బహిరంగ ప్రదేశాలకే ఎందుకు వెళ్ళాల్సి వస్తుందనేది మనం చూడాలి.**

**సర్వశిక్ష అభియాన్ బాలికల విద్యపై ప్రత్యేక దృష్టి పెట్టింది. అది స్కూళ్ళలో బాలికల ప్రవేశం పైననే కేంద్రీకరించింది తప్ప వారి భద్రత కొరకు కాని వారి మరుగుదొడ్డి సౌకర్యాలపై కాని దృష్టి పెట్టలేదు.**

రాష్ట్రీయ ఆరోగ్య మిషన్ ప్రజలందరికీ ఆరోగ్య సౌకర్యాలు కల్పించాలనే ఉద్దేశంతో మొదలైంది. జననీ సురక్ష యోజన పథకం ఇందులోని భాగమే. దీనిద్వారా ప్రసూతి మరణాలను తగ్గించాలనే లక్ష్యం వుంది. ఇందిరాగాంధీ మాతృత్వ సహా యోగ యోజన మరియు యువతుల సాధికారతకై పెట్టిన రాజీవ్ గాంధీ పథకం కూడా ఇందులోని భాగాలే. కానీ భారత దేశంలో అతి ఎక్కువ సంఖ్యలో శిశు మరణాలు నమోదవుతున్నాయి. దీనితో లింగ నిష్పత్తి దెబ్బతింటుంది. అంతేకాక ఈ పనుల నిర్వహణ కోసం నియమించిన ఆషావర్కర్లు తీవ్ర శ్రమ దోపిడీకి గురవుతున్నారు.

కనుక జెండర్ బడ్జెట్ అనేది కేవలం మహిళల కోసం నిధులు కేటాయించడం మాత్రమే కాదు. పెట్టిన పథకాలనూ, కార్యక్రమాలనూ పారదర్శకంగా, బాధ్యతగా సమర్ధవంతంగా నిర్వహిస్తున్నారా? లేదా అనేది ముఖ్యమైన అంశం. గత 3 ప్రణాళిక సంవత్సరాలలో జెండర్ బడ్జెట్‌పై కేంద్రప్రభుత్వం ఇచ్చే ప్రకటనలకూ వాస్తవానికి చాలా తేడాలున్నాయి. 2013 ఆగస్టులో పార్లమెంటులో కాగ్ ప్రవేశపెట్టిన నివేదికలో కేంద్రప్రభుత్వం మహిళా శిశుసంక్షేమ శాఖ పరిధిలో నిధుల కేటాయింపులో జరిగిన అవకతవకలపై తీవ్ర విమర్శలు చేసింది. 2009 మరియు 2012 సం॥లో అత్యాచార బాధితుల పునరావాసం కోసం స్త్రీ శిశు సంక్షేమ శాఖ ఒక్క రూపాయి కూడా కేటాయించలేదని కాగ్ ఎత్తిచూపింది. అదే విధంగా మహిళా స్వయం సహాయ గ్రూపులకు రుణాలు మంజూరు కోసం పెట్టిన రాష్ట్రీయ మహిళాకోష్ పథకంలో కూడా కేటాయించిన మొత్తం నిధులు ఖర్చుపెట్టకుండా మిగిలి పోయాయి. ఇంకొక ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే ఆర్థిక మంత్రి నిర్భయకు నివాళిగా ప్రకటించిన నిర్భయ ఫండ్ కూడా ఖర్చు పెట్టలేదు. జెండర్ బడ్జెట్ పట్ల కేంద్ర ప్రభుత్వానికి ఎంత చిత్తశుద్ధి వుందో ఈ ఉదాహరణలను బట్టి మనం తెలుసుకోవచ్చు.

**అనువాదకుల పేరు కె.నాగలక్ష్మి**

# మాస్సలాం - ఖుదాఫీస్

ఆకాశంలో-
చుక్కలు చూపెడ్తారు
పాతాళంలోకి-
నెట్టి తోసేస్తారు
కేవలం-
రాజకీయాల్లో అనుకున్నా!
జీవితాల్లో-
ఇదే ఆనవాయితీగా మారింది
ఒంటరి వారు-
కాల్మొక్కి వస్తారు తోడుకోసం
వృద్ధులు-
భావికై భరోసా లేక బెంబేలు పడి ఉంటారు.
యువత-
శక్తి సామర్ధ్యాల చేయుతకు చూస్తారు
బాల్యం-
ఆత్మీయతకై అలమటిస్తారు
క్షణికం-
చిరునవ్వు పెదవి కదలిక క్షణం మాత్రమే
విషం-
శివుడి కంఠంలో ఉందంటే కనబడదు
నమ్మకం-
ప్రేమతో పలికే పలుకు శాశ్వతమని
వమ్ము-
కష్టనష్టాల్లో అభిమానం అరాధన వమ్ముకాదని
రేంకులు-
ముఖ్య-విశిష్ట-ప్రత్యేక అతిథులుంటారు.
గ్రేడులు-
ఆత్మీయులు-అభిమానులు ఊపిరై నిలిచే నేస్తాలు
వేదిక-
ఉపన్యాసాలు, కార్యక్రమాలు ముగింపు వరకు
గూడు-
గుండె లోతుల్లో పదిలంగా కట్టుకున్న ప్రేమాలయం
మజ్ బూరి-
అన్యాయం గెలిచి అందరు ఐక్యతతో ఒంటరి చేయడం
షుక్రియా-
బంతిలా దెబ్బలుతింటూ, రక్తం వోడుతూ, పోరాడే శక్తికి
నిజం-
పదవులు, పైసలు, పరిచయాలు పనితీరే వరకే
అబద్ధం-
చుక్క తుడిచి కన్నీటి కడలిలో ముంచే దోస్తీ - ఆత్మీయత
అయిపోయింది-
బెల్లం లేకుంటే ఈగలు ముసరవు
చెదిరింది-
నిస్సహాయ స్థితిలో-నీ -నా-అంతా మేఘావృతం మానవత్వమా !
విశ్వాసము పోయింది- మాస్సలాం!
స్త్రీత్వమా-
సహనం చచ్చింది - ఖుదాహఫీస్.

**- రాజీవ**

ఆరోగ్యం




# థైరాయిడ్ గ్రంధి సంబంధిత వ్యాధులు

## ఒక అవగాహన

- డా॥ భారతీసాగర్

మనం చిన్నపుడు సైన్స్ పాఠ్యాంశాలలో శరీరంలోపల ఉండే అంత:స్రావ గ్రంధులను గూర్చి చదువుకున్నాము కదా! గుర్తుకొస్తుందా! ఆఆ..... అదే పిట్యూటరి గ్రంధి, థైరాయిడ్ గ్రంధి, పాంక్రియాటిక్ గ్రంధి మొదలైనవి. ఈ గ్రంధులు శరీరంలో అంతర్గతంగా ఉండి కొన్ని రకాల రసాయనిక స్రవాలను స్రవిస్తూ ఉంటాయి. వాటిలో ముఖ్యమైనవి ఇన్సులిన్, థైరోనిన్, ADH అడ్రినలిన్, ఫాలికులార్ స్టిములేటింగ్ హర్మోన్, లూటినైజింగ్ హార్మోన్ మొదలైనవి. ఈ సంచికలో మనం థైరాయిడ్ గ్రంధి స్రావాలు, వాటి సమతుల్యత అవశ్యకత, ఈ స్రావాలు ఎక్కువ, తక్కువైనపుడు వచ్చే వ్యాధుల గురించి చర్చించుకోబోతున్నాము.

థైరాయిడ్ గ్రంధి థైరోనిన్, ట్రై ఐదో థైరోనిన్, థైరాక్సిన్ మొదలైన హర్మోనులను స్రవిస్తుంది. ఈ హర్మోన్లు శరీరానికి కావలసినంత నిర్దిష్ట పరిమాణంలోనే స్రవించబడాలి. అయితే ఈ స్రావాలు ఎక్కువైనా, తక్కువైనా కూడా అనేక రకాల వ్యాధులు ఉత్పన్నం అవుతాయి.

**హైపోథైరాయిడ్ వ్యాధి.**

హైపోథైరాయిడ్ వ్యాధి, థైరాయిడ్ గ్రంధి హర్మోన్ల స్రావం తగ్గి, ఆ హర్మోన్ల వలన శరీరంలో జరగవలసిన క్రియలు ఆగిపోవటం వలన వస్తుంది. 99% మందిలో ఈ వ్యాధి థైరాయిడ్ గ్రంధికి వచ్చే వ్యాధుల వలన సంభవిస్తుంది. ఇంక మిగిలిన 1.% మందిలో కేంద్రీయ నాడి వ్యవస్థలో తేడా వలన TSHC (థైరాయిడ్ స్టిములేటింగ్ హర్మోన్) తగ్గటం వలన వస్తుంది. ఈ వ్యాధి జన్మత: రావచ్చు లేదా జన్మించిన తరువాత జీవితకాలంలో ఎప్పుడైనా కూడా రావచ్చు. జన్మతా వచ్చే హైపో థైరాయిడిజమ్‌కి కారణం థైరాయిడ్ గ్రంధి గర్భస్థశిశువుగా ఉన్నపుడు పూర్తిగా నిర్మాణం చెందక పోవటం లేదా గ్రంధి వికృతంగా నిర్మాణం చెందటం కారణం కావచ్చు. దీనివలన థైరాయిడ్‌గ్రంధి ద్వారా స్రవించబడే థైరాయిడ్ హర్మోన్స్ స్రవించవు, తద్వారా హైపోథైరాయిడ్ వ్యాధి వస్తుంది. జన్మత: కాకుండా జీవితకాలంలో ఎప్పుడైనా వచ్చే హైపో థైరాయిడ్ వ్యాధికి ముఖ్యకారణాలు అయోడిన్ మూలకం లోపం, గాయిటర్ వ్యాధికారకాలకు గురికావటం, థైరాయిడ్ గ్రంధి మీద వ్యతిరేకంగా పనిచేసే (మూంటే థైరాయిడ్) మందులతో చికిత్స తీసుకొనటం, థైరాయిడైటిస్, వృద్ధాప్యం వలన థైరాయిడ్ గ్రంధి క్షీణత మొదలగునవి.

హైపోథైరాయిడ్ వ్యాధిలో జీవన క్రియలు మందగిస్తాయి. శరీరంలోని వివిధ కణజాలాలలో గ్లైకోసామైన్, గ్లైకన్స్ అనే రసాయనాలు నిక్షిప్తం చేయబడతాయి. ఈ రసాయనాలు కూడా నీటిని పీల్చుకునే గుణం ఉండటం వలన అవి ఎక్కడ నిక్షిప్తం అయితే ఆ అవయువాలలో మ్యూకస్ కణజాలంలో వాపు ఏర్పడుతుంది. చర్మంపైన సంచులుగా వాపు ఏర్పడుతుంది. ఈ వాపు కాళ్ళు, చేతుల వెనక భాగంలో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ఇంకా చర్మం పాలిపోయినట్లుగా, పొడిగా, చల్లగా, గరుకుగా తయారవుతుంది. వెంట్రుకలు కూడా చిట్లి, పొడిబారుతాయి. జుట్టురాలటం ఎక్కువవుతుంది. గొంతు బొంగురు పోతుంది. గుండె, రక్తప్రసరణ వ్యవస్థల మీద కూడా ఈ వ్యాధి ప్రభావం ఉంటుంది. గుండె నుంచి వచ్చే రక్త ప్రసరణ ప్రమాణం తగ్గుతుంది. నాడి వీలగా కొట్టుకుంటుంది. రక్తపోటుకూడా వస్తుంది. కేంద్రీయ నాడీ వ్యవస్థలోపం వలన వచ్చే హైపోథైరాయిడిజమ్‌లో గుండె సైజు తగ్గే అవకాశం కూడా ఉంటుంది. ఆకలి తగ్గటం, మలబద్ధకం, నీరసంగా ఉండటం, మానసిక ఆందోళన, డిప్రెషన్ మొ॥నవి ఉంటాయి.

స్త్రీలలో హైపో థైరాయిడిజమ్ కారణంగా అండం విడుదల కాకపోవటం, ఋతుస్రావం అధికంగా కావటం, నెలసరి తొందరగా (21రోజులకన్నా తక్కువ వ్యవధితో) రావటం, శారీరక వాంఛలు తగ్గటం వంటివి ఉంటాయి.

థైరాయిడ్ హార్మోన్ ప్రొఫైల్ పరీక్ష చేయించటం ద్వారా ఈ వ్యాధిని నిర్ధారించవచ్చు. T4 హార్మోన్ పరిమాణం తక్కువగా ఉండటం, TSH హార్మోన్ పెరగటం ఈ వ్యాధికి సంకేతంగా భావించవచ్చు.

లెవో థైరాక్సిన్ మందు ఈ వ్యాధి చికిత్సలో ఉపయోగకారి, ఈ మందు 75-150 మైక్రో గ్రాముల పరిమాణంలో ప్రతిరోజు తీసుకోవలసి ఉంటుంది. ప్రతి రోగికి ఆ వ్యక్తిలో ఉన్న లక్షణాలను, రక్త పరీక్షలో థైరాయిడ్ హార్మోన్ లెవల్స్‌ని బట్టి అతను ఎంత పరిమాణంలో ఈ మందు తీసుకోవాలి అనేది వైద్యుడు నిర్ణయిస్తాడు. యువ వయస్సులో రోగులకీ, వృద్ధులకి, గర్భిణిస్త్రీలకి ఈ హార్మోన్ అవసరం వివిధ రకాలుగా ఉంటుంది. అది వారి వయస్సుని, అవసరాలని బట్టి వైద్యుడు దీనిని నిర్ధారించాల్సి ఉంటుంది. కేంద్రీయ నాడీ వ్యవస్థ లోపాల వలన వచ్చే హైపో థైరాయిడిజమ్‌లో జీవితాంతం రోగి ఈ మందుని వాడవలసిన అవసరం ఉంటుంది.

**థైరోటాక్సికోసిస్ వ్యాధి :-** శరీరంలో థైరాయిడ్ హార్మోన్ లెవల్స్ పెరగటాన్నే థైరోటాక్సి కోసిస్ అంటారు. అయితే ఈ హార్మోన్ పెరిగిన తర్వాత శరీరంలో దాని కార్యాలను అధికంగా చేస్తూ ఉంటే దానినే హైపర్ థైరాయిడ్ స్థితి అంటారు. థైరాయిడ్ గ్రంధిలో ఏర్పడే కణుతులు, థైరాయిడ్ కాన్సర్, గాయిటర్ కణితి, పిట్యూటరి గ్రంధిలో ఏర్పడే కణుతులు, థైరాయిడ్ హార్మోన్‌ను అధిక పరిమాణంలో తీసుకోవటం, గ్రేవ్స్ వ్యాధి, అయోడిన్ కలిగిన మందులను అధికంగా సేవించటం వలన ఈ థైరోటాక్సికోసిస్ వ్యాధి వస్తుంది. గర్భిణిస్త్రీలలో, ప్రసవమైన స్త్రీలలో కొంతమందికి గర్భధారణ వలన కలిగే మార్పుల వలన కూడా ఈ వ్యాధి వస్తుంది. మెదడులోని పిట్యూటరి గ్రంధిలో ఏర్పడే కొన్ని రకాల కణుతుల వలన కూడా ఈ వ్యాధి వస్తుంది.

ఈ వ్యాధిలో గొంతు దగ్గర థైరాయిడ్ గ్రంధి వాపుఉంటుంది. శరీరబరువు తగ్గటం, నీరసంగా ఉండటం, అధిక వేడిని తట్టుకోలేక పోవటం, శరీరంపైన దురదలు మొ॥గు లక్షణాలు ఉంటాయి. ఆయాసం రావటం, గుండె స్పందన తెలియటం (పాల్పిటేషన్), మానసికంగా అశాంతిగా ఉండటం, చికాకుపడటం, నిద్రపట్టకపోవటం, వణుకుడు మొ॥గు నరాల సంబంధ లక్షణాలుంటాయి. ఇంకా ఆకలి అధికంగా ఉండటం, ఎక్కువసార్లు విరేచనాలవటం ఉంటాయి. కళ్ళు ముందుకు పొడుచుకొచ్చినట్లు ఉండటం, కళ్ళల్లో మంటలు, దృష్టి మందగించటం వంటి కంటికి సంబంధించిన లక్షణాలుంటాయి. స్త్రీలలో నెలసరి తొందరగా రావటం, శారీరక వాంఛలు తగ్గిపోవటం జరుగుతుంది.

రక్తపరీక్ష ద్వారా థైరాయిడ్ హార్మోన్ ప్రొఫైల్ గురించి తెలుసుకొని ఈ వ్యాధిని నిర్ధారించవచ్చు. థైరోటాక్సికోసిస్ వ్యాధిలో ఫ్రీ T4 హార్మోన్ పరిమాణం పెరుగుతుంది మరియు TSH హార్మోన్ లెవల్స్ పడిపోతాయి.

థైరోటాక్సికోసిస్ వ్యాధికి కారణమైన కణుతులను శస్త్ర చికిత్స ద్వారా తొలగించాల్సి ఉంటుంది. కొన్నింటిలో రేడియో థెరపీ చేయాల్సి వస్తుంది. గ్రేవ్స్ వ్యాధిలాంటి వాటిలో మందులతో చికిత్స చేయవచ్చు. వీటిలో మెథిమాజోల్, కార్బిమజోల్, ప్రొపైల్ థియురాసిన్ లాంటి థియోనమైడ్స్‌ను వాడుతారు. అయితే మందులా, రేడియో థెరపీనా లేదా శస్త్ర చికిత్స చేయాలా అన్నది వ్యాధికారణాన్ని, తీవ్రతని, గర్భధారణలాంటి ప్రత్యేక పరిస్థితులను బట్టి దీనిని నిర్ణయిస్తారు. ●

## ఏదీ రక్షణ?

పల్లవి॥ ఎక్కడున్న ఎక్కడున్నది
మగువకు రక్షణెక్కడున్నది

చరణం॥ నడి ఇంటిలో ఉన్నదా?
పని ఇంటిలో ఉన్నదా?
చదివే బడిలో ఉన్నదా?
కొలిచే గుడిలో ఉన్నదా?

చ॥ కామోన్మాదుల చలలో కడతేరేది సబలే
గర్భపు గదిలొ కనులిప్పక బలయ్యేది అబలే
నడిరోడ్డున ఒంటరిగా నడవగలదా మహిళ?
పట్టపగలు పదిలంగా పనిచేయగలదా సఖిల?
మగాడిలా నడిరేయిలో నడిచెల్లగలద ఆడది?
మగాడిని ఎదిరించి బతకగలదా ఆడది?
॥ఎక్కడ॥

చ॥ మగువా ఎక్కడున్నది ఎక్కడున్నది
నీలో బలహీనత ఎక్కడున్నది
తెగించలేని తెగింపు వున్నా తీరదు నీ సోకం
నీ సత్తువనరించే వారినెన్నుకునుటే నీ శాపం
కట్టుబాట్ల మధ్య కట్టు బానిసలైనంతకాలం
కులమత చట్రాలలో నీవు కూరుకున్నంతకాలం
కదలలేవు మెదలలేవు నీ సంకెళ్ళను తెంచలేవు
ఈ వ్యవస్థని సంస్కరించే అపరశక్తి కావాలే నీవు

-మూడగాని మధు

మహిళా మణిపూస

# ఆదివాసీల కల్పతరువు మహాశ్వేతాదేవి

- వకుళాభరణం లలిత



'మా రాందాయి' (పెద్దక్క) అని ఆదివాసీలు ఆప్యాయంగా పిలుచుకునే రచయిత్రి మహాశ్వేతాదేవి. ఆమె బెంగాలీ భద్రలోక్ కుటుంబీకురాలు. తల్లి ధరిత్రీదేవి, రచయిత్రి, సంఘసేవకురాలు. తండ్రి మనీషి ఘటక్‌కరి, చిన్నాన్న రుత్విక్‌ఘటక్ - పేరు పొందిన సినీ దర్శకుడు. మేనమామ సచీన్ చౌదరి సుప్రసిద్ధ వారపత్రిక - ఎకనామిక్ అండ్ పొలిటికల్ వీక్లీ వ్యవస్థాపక సంపాదకుడు. భర్త బిజన భట్టాచార్య, ఇండియన్ పీపుల్స్ ఆర్ట్ థియేటర్ నిర్వాహకుడు, నాటకకర్త, బెంగాల్ కరువును గూర్చి ఆయన రాసిన 'నవాన్న' నాటకాన్ని, 'అబ్బాస్‌దర్తికి లాల్' అనే సినిమా తీశాడు.

మహాశ్వేతాదేవి ఇరవై ఏళ్లపాటు ఇంగ్లీషు లెక్చరర్‌గా పనిచేసింది. ఆమెకు ఆదివాసులంటే పంచప్రాణాలు. కారణం ఆదివాసీలకు మనమంతా తరాల తరబడి అన్యాయంచేశాం. దాన్ని కొంతయినా 'సవరించేందుకే నా పూనిక ' అన్నారు. అదివాసీలకు ఆమె 'అమ్మ' అయింది.

భారత దేశంలోని ఆదివాసీలకోసం రచనలు చేసిన వారు నాకు తెలిసి ముగ్గురే ముగ్గురు. ఇతర దేశాలనుంచి వచ్చిన వెర్రియర్ ఎల్విన్, హైమాండర్ఫ్‌ను వదలివేస్తే, మహాశ్వేతాదేవి, వెన్నెలకంటి రాఘవయ్య, ధక్కర్‌బాపా. రచయిత్రిగా ఆమె ఒక లెజెండ్. ప్రభుత్వము, జమీందార్లూ, భూస్వాములు, షావుకార్లూ ఆదివాసీలను అడవులనుంచీ, భూములనుంచీ తరిమివేసిన ఉదంతాన్ని వెట్టిచాకిరినీ, పోయిన హక్కులను సాధించటానికి వారు సాగించిన పోరాటాల్ని నవలల్లో, కథల్లో, వ్యాసాల్లో చిత్రిస్తూ వస్తున్నారు ఈ రచయిత్రి. 130 రచనలకి పైగా బెంగాలీలో రాశారు. తెలుగులోకి వచ్చినవి మాత్రం చాలా తక్కువే. 'ఎవరిదీఅడవి?' 'ఒకతల్లి ' 'రాకాసికోర' "దెయ్యాలున్నాయి జాగ్రత్త" హెచ్‌బిటి పుస్తక రూపంలో వచ్చాయి. 'మకరసవర' 'దీబార్', 'ద్రౌపది' లాంటి కథలు, 'వసంతకాల మేఘగర్జన' 'పశ్చిమ బెంగాల్‌లో గిరిజనుల భూముల పరాయికరణ, 'భీకరయుద్ధం తర్వాత' అనే బెంగాలీకథ, 'శనీచరి' అనేకథ. వివిధ పత్రికల్లోకి అనువాదంలో వచ్చాయి. 'రుదాలి' కథ సినిమా తీశారు. అది ఆమెకథ కాదన్నా ఆమె ఎంతో ముచ్చట పడ్డకథ.

పశ్చిమబెంగాల్ నెత్తురుటేర్లలో వున్నప్పుడు 'ఒకతల్లికథ' రాశారు. 'ఝూన్సీరాణి' 'ఎవరిదీఅడవి'?లో ప్రజల పాత్రనీ, వాళ్ల త్యాగాన్ని కీర్తించింది మహాశ్వేతాదేవి.

వలస వ్యతిరేక, సామ్రాజ్యవాద వ్యతిరేక, భూస్వామ్య వ్యతిరేక పోరాటాలు ఆదివాసీలు ఎన్నోచేశారు. వాళ్లను వెనక్కి నెట్టేశారు. అందుకే ఆమె తపన, ఆవేదన. జీవితాంతం వాళ్లను గూర్చి రాయటానికి కంకణం కట్టుకున్నారు.

గత30ఏళ్లలోగా గిరిజనేతరుడెవడైనా ఒక ఆదివాసినుంచి భూమి తీసుకుంటే అది చట్ట విరుద్ధమని భూ సంస్కరణ చట్టం, 1986 స్పష్టంగా నిర్దేశించింది.

భారతదేశ ప్రజల దృష్టిలో ఆదివాసీలనే ప్రజలు ఉన్నారన్న విషయం

**ఆనాడు తెల్లదొరలతో పోరాడినట్లే ఈనాడు నల్లదొరలతో పోరాడాలి. 1/70 చట్టం ఉల్లంఘింపబడుతూనే ఉంది. గిరిజనేతరులు ఆదివాసీల జీవితాలతో చెలగాటమాడుతున్నారు. భూపరాయికరణమే గాక, ఆదివాసీ స్త్రీలపై అత్యాచారాలు జరపటం, వాళ్లను వివాహం చేసుకునే నెపంతో భూమిని కాజేయటం చేస్తూనే ఉన్నారు.**



**నాగరికత పెరిగేకొద్ది, మానవులు మానవత్వాన్ని విడనాడి, తమకంటే అమాయకులైన నిరాడంబరులైన ప్రజలను ఆర్థికంగా, సాంఘికంగా, రాజకీయంగా దోచుకోవటం ప్రారంభించారు. నిజాయితీలో, కష్టపడి పనిచేసి బతుకుకోసం పోరుచేసే ప్రజల జీవితాలతో చెలగాటాలాడుతున్నారు. ఆదివాసులు వాళ్ల ఓపిక ఉన్నంతవరకు పోరాడుతూనే ఉన్నారు. ఎప్పుడు ఓపిక నశించి, భూమి బద్దలౌతుందో తెలియదు. అందుకే గిరిజనులు భూమికోసం, విముక్తికోసం రాజీలేని పోరాటం చేస్తూనే ఉన్నారు.**

ఎవ్వరికీ గుర్తుండదు. పశ్చిమ బెంగాల్ రాష్ట్రమంతటా గిరిజనేతరులు స్థానిక భూమి రిజిస్ట్రేషన్ అధికారులతో కుమ్మక్కై, లాలూచీపడి కాజేస్తున్నారు. ఇది బెంగాల్‌లోనే కాదు ఈ కథ దేశమంతటా జరుగుతూనే ఉంది.

ఇది అత్యంత అధునాతన పద్దతిలో సాగుతున్న వర్గదోపిడీ. దేశమంతటా గిరిజన భూముల పరాయీకరణ తతంగం జరుగుతున్నా, అధికారులు అడ్డు పడడం లేదు. ప్రతిరాష్ట్రంలోని గిరిజనులు తమ భూముల్ని ఈ విధంగా పోగొట్టుకుంటూనే ఉన్నారు. 'అరణ్యేర్ అధికారి' అనే పేరుతో 1975లో నవలవచ్చింది. రచయిత్రిగా, వర్తమాన సమాజంలో వ్యక్తిగా, పరిపూర్ణ చారిత్రక భౌతికవాద దృష్టితో బిర్సా ముండారీ పుట్టుకను, పరిణామం యదార్థ రూపాన్ని చిత్రీకరించారు ఈ నవలలో. బిర్సాముండా మరణంతో విప్లవం ఆగదు. కాలక్రమంలో వారి వారసులే ఉద్యమాన్ని ముందుకు తీసుకుపోతారు. తిరుగుబాట్ల నుంచి విప్లవం వస్తుంది. ఈ నవలను 'ఎవరిదీ అడవి ' పేరుతో పోలు శేషగిరిరావు తెలిగించాడు.

భూస్వామ్య వ్యతిరేకపోరాటాలు చేసిన ఆదివాసీల గూర్చి జీవితాంతం రాయడానికి పూనుకున్నారు మహాశ్వేతాదేవి. ఆమె దృష్టిలో ఆదివాసీ స్త్రీలు నగరవాసులకన్నా నయం. అక్కడ వరకట్నాలుకానీ, వరహత్యలుకానీ లేవు. భూమి హక్కులు స్త్రీలకుండవు. ఇప్పుడిప్పుడు ఆ స్త్రీలు కూడా చైతన్యవంతులై పోరాటాలు చేస్తున్నారు. "ఆదివాసులు, దళితులు, కార్మికులు, అందరూ కలిసి పోరాడాలి". అని అంటారు మహాశ్వేతాదేవి.

ఆదివాసులతో మమేకమైనవారు బి.డి.శర్మ, మహాశ్వేతాదేవి, ఆదివాసీలకు ఇంకా స్వాతంత్ర్యం రాలేదు. ఆనాడు తెల్లదొరలతో పోరాడినట్లే ఈనాడు నల్లదొరలతో పోరాడాలి. 1/70 చట్టం ఉల్లంఘింపబడుతూనే ఉంది. గిరిజనేతరులు ఆదివాసీల జీవితాలతో చెలగాటమాడుతున్నారు. భూపరాయికరణమే గాక, ఆదివాసీ స్త్రీలపై అత్యాచారాలు జరపటం, వాళ్లను వివాహం చేసుకునే నెపంతో భూమిని కాజేయటం చేస్తూనే ఉన్నారు.

నిన్నగాక మొన్న జరిగిన బాలింతరాలు భారతీబాయి సంఘటన అందర్నీ దిగ్భ్రాంతికి గురిచేసింది. తెలంగాణా ఉద్యమంలో విసునూర్ దేశముఖ్ రామచంద్రారెడ్డి బాలింతరాలి పాలుపిండించి పొలంలో పోయించినట్లు, ఈనాడు 1997లో పోలీసులు భారతీబాయిపట్ల అంత పాశవికంగా ప్రవర్తించారు. ఓరుగల్లులో గిరిజన యువకుడైన లక్కం చంద్రుని చంపేసి, కన్నీరు మున్నీరుగా విలపిస్తున్న అతని భార్య సమ్ము మీద అత్యాచారం చేశారు. అందుకే మహాశ్వేతాదేవి 'ద్రౌపది' కథ రాసింది 'దోప్కి' ఆదివాసీల యువతి, నక్సలైటు యువతి, పోలీసులామెను వెంటాడి, పట్టుకొని ఒళ్ళు హూనం చేస్తే, ఆమె ఆ ఉన్నతాధికారి ముందు వివస్త్రయై నిలబడుతుంది. అప్పుడామె అన్నమాటలు " నా ఒంట్లో దాచుకోడానికేమి మిగల్చలేదు నీ వాళ్ళు. నేను సిగ్గుపడాల్సిన మగాడు కూడా ఇక్కడెవ్వరూ లేరు. మీరు నాబట్టలు ఊడదీయగలరే గానీ నాకు బట్టలు వేయటం మీతరం గాదు" అంటూ గర్జిస్తుంది.

నాగరికత పెరిగేకొద్ది, మానవులు మానవత్వాన్ని విడనాడి, తమకంటే అమాయకులైన నిరాడంబరులైన ప్రజలను ఆర్థికంగా, సాంఘికంగా, రాజకీయంగా దోచుకోవటం ప్రారంభించారు. నిజాయితీలో, కష్టపడి పనిచేసి బతుకుకోసం పోరుచేసే ప్రజల జీవితాలతో చెలగాటాలాడుతున్నారు. ఆదివాసులు వాళ్ల ఓపిక ఉన్నంతవరకు పోరాడుతూనే ఉన్నారు. ఎప్పుడు ఓపిక నశించి, భూమి బద్దలౌతుందో తెలియదు. అందుకే గిరిజనులు భూమికోసం, విముక్తికోసం రాజీలేని పోరాటం చేస్తూనే ఉన్నారు.

ఆదివాసీల పోరాటాలు ఆగేవరకు మహాశ్వేతాదేవికి విశ్రాంతి లేదు. పోరాడుతూనే ఉంటారు. అంతటి పోరాట పటిమగల మహాశ్వేతాదేవిలు ఎందరున్నారు.?

ఇక్కడ ఒక విషయాన్ని చెప్పాలి. మహాశ్వేతాదేవికి తానేకాదు. ఎవరు ఆదివాసీల గురించి రాసినా అభిమానం ఎక్కువ. ఒకసారి కాకతీయ విశ్వవిద్యాలయంలో జరిగిన సదస్సులో విముక్త జాతులను గూర్చి వి. లలిత మంచి గ్రంథం రాశారని చెప్పారట. తెలుగు విశ్వవిద్యాలయంలో కూడ అదే మాట అంటే "నేను ప్రేక్షకుల్లో ఉండి నేనే ఆ లలితను" అన్నాను. ఆమె సంబరపడి దగ్గరకు తీసుకుని ఎంతో సంతోషాన్ని వ్యక్తంచేశారు. మహాశ్వేతాదేవితో అలాంటి సన్నిహితత్వం రావటం నా అదృష్టంగా భావించాను.

•

కథ

# కాల పురుషులు

- మృణాళిని

"మంగవాళ్ళన్నాక లక్ష పనులుంటాయి. కోమలి గారూ, తెలీకుండా మాట్లాడ్తారేం?" మధుసూదన్ విసుక్కున్నాడు.

"ఆవిడకెలా అర్థమౌతుందోయ్. వట్టి కొలీగ్. నా కష్టాలు మా ఆవిడకే అర్థం కాదు. నేను చచ్చీ చెడీ బోల్డు పనిచేసి కాలేజినుంచి ఇంటికి వెళ్తానా? అప్పుడు మొదలు పెడ్తుంది. చిట్‌ఫండ్ డబ్బు కట్టాలండీ. సైటు దగ్గరికెళ్లాలండీ, బాబు ట్యూషన్ టీచర్‌తో మాట్లాడాలండీ అంటూ నాకెక్కడ కుదుర్తుంది చెప్పు. అస్సలు టైంలేక ఛస్తుంటే"...సూర్యారావు అన్నాడు.

మోహన్ విరక్తిగా నవ్వాడు. "మీ ఆవిడ నయమే సూర్యారావ్. కనీసం మగ పన్లు చెప్తుంది. మా ఆవిడ 'పిల్లాణ్ణి కాస్సేపు ఆడించండి, కిరాణా కొట్టుకు వెళ్లండి. నేను పని చేసుకోవాలి'అంటుంది. నాకసలు టైం ఎక్కడుంటుంది. ఇలాంటి చిల్లర పన్లు చెయ్యడానికి?" ఆవేశంగా ముగించాడు మోహన్.

"పోన్లే. టోకు పనులే చెయ్యండి"కోమలి అంది. మోహన్ అర్థం కానట్టు చూశాడు కోమలికేసి.

'అసలు ఈ భారతం ఎందుకు ప్రారంభించారో మన కవిత్రయం?"సీతాలక్ష్మి అడిగింది. కోమలి నవ్వింది. "ఇంటర్ హాఫ్ ఇయర్లీ పేపర్లు ఇంకా దిద్దలేదేమని అడిగాను మధుసూదన్‌గారిని. ఆయనకు లక్ష పనులుంటాయట. అందుకని పేపర్లు దిద్దడం లాంటి చిల్లర పన్లు చెప్పొద్దన్నారు."

మధుసూదన్ ఉరిమి చూశాడు కోమలికేసి. 'ఇల్లూ, కాలేజీ తప్ప ఏమీ తెలీని మీవంటి కూపస్థ మండూకాలు చేయడానికి పన్లేక పేపర్లు దిద్దుతారు కానీ, మాకిదే పనా? అవతల ప్రపంచం రోజు రోజుకీ తగలబడిపోతోంటే, హాఫ్ ఇయర్లీ పేపర్లట..."

"మీరేమైనా ఫైరింజనా ప్రపంచం తగలబడిపోతుంటే ఆర్పడానికి?"నళిని అడిగింది.

"ఛ ఆర్పడం కాదు. చర్చిస్తారు. ప్రపంచం తగలబడిపోతుందంటే ఎందుకు తగలబడుతోంది? ఎలా తగలబడుతోంది? ఎవరు తగలబెడుతున్నారు? అని రోజుకో గంట చర్చిస్తారు..."సీతాలక్ష్మి అంది.

"అవునండీ. ఈ వెధవ కాలేజీలో సామాజిక స్పృహకు టైం లేదు. నిన్న 'ఫైర్' సినిమాపై గొడవ చూసారుగా బొంబాయిలో, ఢిల్లీలో! సాయంత్రం రెండు గంటలు దాన్ని చర్చించాం. మొన్నేమో బిజెపి ఎందుకు ఓడిపోయిందో చర్చించాం!...."

"ఇవాళ హాఫ్ ఇయర్లీ పేపర్లు ఎందుకు దిద్దకూడదో చర్చిస్తారు కదండీ..." కోమలి అంది.

సూర్యారావు చిరాగ్గా చూశాడు కోమలి కేసి. "ఇలాంటి పన్లు ఎవరైనా చెప్తారండీ. మీకు వేరే విషయాలు పట్టవు కనుక, ప్రపంచం ఏమై పోయినా అఖ్ఖర్లేదు కనుక. ఎప్పుడూ నోట్సులు, పిల్లలు, ఇల్లూ అంటూంటారు. మనషై పుట్టాక జనరల్ నాలెడ్జి ఉండాలండీ. ఎప్పుడూ డ్యూటీలు కాదు."

రెండు రోజుల తర్వాత "మధుసూదన్‌గారూ పేపర్లు దిద్దేసారా?" కోమలి అడిగింది.

మధుసూదన్ విసుగ్గా చూడబోయి తమాయించుకున్నాడు. "కొన్ని మిగిలిపోయాయండి. ఏదీ టైమెక్కడ? తెల్లారి లేచినప్పట్నుంచీ బిజీయే"

అలాగా మధుసూదన్‌గారు. మీ దినచర్య ఎలావుంటుదో ఓసారి చెప్తారా?" పత్రికా విలేకరిలా అడిగింది సుభద్ర.

మధుసూదన్ గొంతు సరిచేసుకున్నాడు. "ఏడుంపావుకు లేస్తాను... లేవక తప్పదులెండి. మరీ ఎక్కువసేపు పడుకునే అలవాటున్న మగాణ్ణి కాను. ఒక్కోసారి ఏడుకే లేచేస్తాను. బెడ్ కాఫీ అయ్యాక పేపర్లు చదవాలి కదా. రెండు ఇంగ్లీషు పేపర్లు, రెండు తెలుగు పేపర్లు చదివేసరికి 8.30 అవుతుంది."

"అవుడు పిల్లల్ని స్కూల్లో దింపుతారా?" కోమలి అడిగింది.

"అబ్బే, వాళ్లమ్మకు స్కూటీ వుంది కదా. తను చిన్నవాణ్ణి దింపుతుంది. పెద్దవాడు బస్సులో వెళ్తాడు."

"ఓహో, అయితే పనిమనిషి చేత పనులు చేయిస్తారన్నమాట" సీతాలక్ష్మి అంది.

"నాకేం ఖర్మండీ. అసలు మా పనిమనిషి నేను నిద్రలేవకముందే పని చేసుకు వెళ్లిపోతుంది. అదేంలేదు. టి.వి.

**మధుసూదన్ గొంతు సరిచేసుకున్నాడు. "ఏడుంపావుకు లేస్తాను... లేవక తప్పదులెండి. మరీ ఎక్కువసేపు పడుకునే అలవాటున్న మగాణ్ణి కాను. ఒక్కోసారి ఏడుకే లేచేస్తాను. బెడ్ కాఫీ అయ్యాక పేపర్లు చదవాలి కదా. రెండు ఇంగ్లీషు పేపర్లు, రెండు తెలుగు పేపర్లు చదివేసరికి 8.30 అవుతుంది."**

**"అదేనోయ్... 7 గంటలకు లేచారా, 7.05కు లేచారా. ఇడ్లీకి వాళ్లావిడలు చేసిన పచ్చళ్లు బాగున్నాయా లేదా, స్టార్ ప్లస్ గుడ్‌మార్నింగ్ ఇండియాలో ఎవరి ఇంటర్వ్యూ వచ్చిందీ, ఎవరికి తను ఫోన్ చేసారు. ఎవరు తనకి చేసారు, చంద్రబాబుగారు ఢిల్లీలో ఉన్నారా, నల్గొండలో ఉన్నారా..."**

చూస్తాను కాస్సేపు. 9.15 దాకా కాఫీలు తాగుతూ టీ.వి. చూస్తాను తర్వాత స్నానం చేసాక, ఇక ఫోన్లో మాట్లాడాల్సిన వాళ్లుంటారు కదా. మన చుట్టూ మనుషులు ఏమైపోతున్నారో తెలుసుకోవద్దూ."

"అయ్యో. ఎందుకొద్దూ. మీ ఫోన్ కోసమే ఎన్నో ప్రాణాలు ఇంకా బిగపట్టుకుని వుంటాయి కదా" కోమలి అంది.

"కరెక్ట్. 9.45 దాకా ఫోన్లయ్యాక టిఫిన్ తిని బయల్దేరతా కాలేజీకి."

"పోన్లెండి. మీ కేరేజి పెట్టుకునే పనైనా చేసుకొంటున్నందుకు సంతోషం" నళిని అంది.

"భలేవారే. నాకు తీరుబాటెక్కడండీ. ఆవిడ బాబుని దింపి వచ్చాక నా డబ్బా, తన డబ్బా కూడా సర్దేస్తుంది. ఇక్కడ సంగతి మీకు తెలిసిందే' అని ఆగాడు మధుసూదన్.

"గంట క్లాసుకు అరగంట లేటుగా వెళ్లి, పావుగంట ముందుగా వచ్చేయాలంటే ఎంతో ప్లానింగ్ అవసరం! అందుకే మీరు ఇక్కడ కూడా బిజీగానే ఉంటారు" కోమలి మెచ్చుకోలుగా అంది.

మధుసూదన్ పళ్లు కొరకడం చూసి, సుభద్ర కల్పించుకుంది. "ఇక సాయంత్రం రొటీన్ చెప్పండి మధుసూదన్‌గారూ."

మధుసూదన్ ముఖం వికసించింది. "నాలుగున్నరకు ఇక్కడ్నుంచి బయల్దేరతామా! నేను, సూర్యారావు, మోహన్... ఆ. కొత్తగా యాదయ్య ప్లేస్‌లో చేరిన శేఖరం – అందరం ఇరానీ హోటల్లో కూర్చుని, ఉదయం నుంచి చేసిన పనుల గురించి చర్చించుకుంటాం."

'పనులా?' సుభద్ర ఆశ్చర్యంగా అడిగింది.

"అదేనోయ్... 7 గంటలకు లేచారా, 7.05కు లేచారా. ఇడ్లీకి వాళ్లావిడలు చేసిన పచ్చళ్లు బాగున్నాయా లేదా, స్టార్ ప్లస్ గుడ్‌మార్నింగ్ ఇండియాలో ఎవరి ఇంటర్వ్యూ వచ్చిందీ, ఎవరికి తను ఫోన్ చేసారు. ఎవరు తనకి చేసారు, చంద్రబాబుగారు ఢిల్లీలో ఉన్నారా, నల్గొండలో ఉన్నారా..."

"అవునండీ. అవే మాట్లాడుకుంటాం. మీలా వెంకటగిరి చీరలూ, ఫేషియల్సూ, గిల్టు నగలూ మాట్లాడుకోమని మీకు మేమంటే ఈర్ష్య' సూర్యారావు అన్నాడు.

ఇంతలో బి.ఏ. ఫైనల్ విద్యార్థి స్టాఫ్‌రూంలోకి వచ్చాడు. 'ఏం కావాలి ప్రసాద్?' కోమలి అడిగింది.

"మీరు ఓ పావుగంట టైం ఇవ్వగలరా మేడం నాకు?"

"నేనా? దేనికి? ఏవైనా హిస్టరీ సందేహాలా?"

"కాదు మేడం. ఒక ప్రైవేట్ సంస్థ వక్తృత్వ పోటీలు పెడుతుంటే పేరిచ్చాను. టాపిక్ విదేశాంగ విధానాల గురించి గానీ, కంప్యూటరీకరణ గురించి గానీ ఉండొచ్చట. ఏవైనా పాయింట్స్ చెప్తారేమోనని"

కోమలి మధుసూదన్ కేసి చూసింది. "ఇదిగో ఈ సార్ చెప్తారు. ఆయనకు లోకజ్ఞానం ఎక్కువ. రోజూ పేపర్లు, స్టార్‌న్యూస్‌లూ ఔపోశన పడుతుంటారు. మధుసూదన్‌గారూ, కాస్త ఈ అబ్బాయికి మీ విజ్ఞానాన్ని పంచండి."

మధుసూదన్ తడబడ్డాడు. "నాకా?.... నాకెక్కడ కుదుర్తుందండీ... అసలే టైం లేక ... "

ప్రసాద్ కోమలి కేసి చూశాడు. "నేనసలు మిమ్మల్ని గానీ సుభద్రా మేడం గార్ని గానీ అడుగుదామని వచ్చాను. మేడం. మన సార్లకు తెలుస్తుందని నేనసలు అనుకోనేలేదండి. మీకు వీలైతే చెప్పండి మేడం. లేకపోతే నేనే రాసుకుంటాను" అంటూ వెళ్లిపోయాడు.

అపుడే లోపలికి వచ్చిన కొత్త లెక్చరర్ శేఖర్ అన్నాడు. "అరె. కోమలిగారూ. ఈ కుర్రాణ్ణి మీకు టైం లేకపోతే మధుసూదన్‌గారి ఇంటికి పంపాల్సింది. వాళ్లావిడ చాలా తెలివైనవారండీ. మొన్న వాళ్లింటికి వెళ్తే ఎన్నికల విశ్లేషణ ఎంత బాగా చేసారో ఆవిడ! నాకు భలే ముచ్చటేసింది. కదూ, మధుసూదన్‌గారూ...'

మధుసూదన్ మాట్లాడే స్థితిలో లేడు.

"వాళ్లావిడ మాట్లాడింది అర్థం చేసుకోవడానికి.... ఐమీన్... వినడానికి ఆయనకు టైం వుండొద్దూ! ఆయన ఎప్పుడూ నవాలక్ష పన్లతో బిజీగా ఉంటారాయె..." కోమలి అంది.

**(కోమలి గాంధారం బుక్ నుండి...)**



కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డునందుకున్న

## కాత్యాయని విద్మహేకు అభినందనలు

తెలుగు రచయిత్రి కాత్యాయని విద్మహే రచించిన "సాహిత్య ఆకాశంలో సగం" పుస్తకానికి ఏడాది సాహిత్య అకాడమీ పురస్కారం లభించింది. కాకతీయ విశ్వ విద్యాలయం ప్రొఫెసర్, ప్రసిద్ధ విమర్శకురాలు. సాహిత్య లోకానికి సుపరిచితురాలైన ఆమె స్త్రీల సాహిత్యాన్ని వెలికి తీయడంలో చేసిన కృషి అనన్యమైనది. కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు అందుకున్న కాత్యాయని విద్మహే గారికి చైతన్య మానవి అభినందనలు తెలియజేస్తోంది.

జ్ఞాపకాలు

# శ్రామిక జన బాంధవి



- అల్లూరి మన్మోహిని

**మా ప్రియతమ సోదరి చివరి మజిలీ ఎంత గొప్పది. అది బీహార్ రాష్ట్రంలోని బుద్ధగయ. గౌతమ బుద్ధునికి జ్ఞానోదయం కల్గిన ఆ గొప్ప ప్రదేశం ఐద్వా జాతీయ మహాసభలకు ఆహ్వానం పల్కిన సందర్భం. బుద్ధునికి దీటుగా దయామయి అయిన శ్యామిలీగుప్త ఐద్వా మహాసభలకు హాజరై పతాకావిష్కరణ చేసి తన తల్లి (ఐద్వా) ఒడిలో కన్నుమూసారు. ఐద్వా మహాసభకు తన చివరి సందేశం అందించారు.**

అది 26-11-2013 తేది ప్రజాశక్తి దినప్రతిక మొదటి పేజిలో ముందుగా ఆమె ముఖచిత్రం చూస్తే సంతోషం కల్గింది. క్రింద చూస్తే పిడుగులాంటి వార్త.

మా ప్రియతమ సోదరి చివరి మజిలీ ఎంత గొప్పది. అది బీహార్ రాష్ట్రంలోని బుద్ధగయ. గౌతమ బుద్ధునికి జ్ఞానోదయం కల్గిన ఆ గొప్ప ప్రదేశం ఐద్వా జాతీయ మహాసభలకు ఆహ్వానం పల్కిన సందర్భం. బుద్ధునికి దీటుగా దయామయి అయిన శ్యామిలీగుప్త ఐద్వా మహాసభలకు హాజరై పతాకావిష్కరణ చేసి తన తల్లి (ఐద్వా) ఒడిలో కన్నుమూసారు. ఐద్వా మహాసభకు తన చివరి సందేశం అందించారు.

అఖిల భారత ప్రజాతంత్ర మహిళా మహాసభ 1981లో మద్రాసులో జరిగిన సందర్భంలోనే తొలి కార్యదర్శిగా బాధ్యతలు స్వీకరించారు. సోషలిజానికి చిహ్నంగా 1977లో ఏర్పడిన పశ్చిమ బెంగాల్‌లోని ముఖ్యమంత్రి జ్యోతిబాసుగారి వామపక్ష ప్రభుత్వం 30 సం॥లు సామ్యవాద కేతనం అధ్వర్యాన సాగిన ప్రజా ప్రభుత్వం ప్రపంచ చరిత్రలోనే అత్యద్భుతం. విశ్వశాంతి కపోతంగా వెలసిన రవీంద్రుని శాంతినికేతానికి గర్వకారణం ఆ చరితం. శ్రామిక మహిళల సంక్షేమం కోసం ఉద్యమించిన శ్యామిలిగార్కి చిహ్నంగా సోషలిజం అంటే తల్లి ఒడిలాంటిదని రుజువుచేస్తూ కార్మిక మహిళలకు ప్రసూతి సహాయనిధి పథకాన్ని ప్రవేశపెట్టిన ముఖ్యమంత్రి జ్యోతిబాసుగారి ప్రభుత్వం దేశచరిత్రలోనే అపురూపం, ఆదర్శం. వ్యవసాయ భూములపై మహిళలకు హక్కులు కల్పిస్తూ జాయింటు పట్టాలు ఇచ్చిన ఆదర్శపాలన పశ్చిమబెంగాల్ ప్రభుత్వానిది. మహిళా ఉద్యమ నేతయైన శ్యామిలీగారికి అందులో పాత్రవుంది. పోలీసులకు కూడా సంఘం పెట్టుకునే హక్కుని చట్టం చేయటంతోపాటు ప్రజాఉద్యమాలపై పోలీసుల నిర్బంధం నిషేదించింది. ముఖ్యంగా ముఖ్యమంత్రి కార్యాలయంపై శత్రుమూకలు దాడి చేసి కిటికీల అద్దాలు రాళ్లతో పగలకొట్టినప్పుడు కూడా జ్యోతిబాసుగారు పోలీసు శక్తిని ఉపయోగించుకోకుండా కార్యాలయంలోనే ప్రశాంతంగా తన పనిని చేసుకోవటం చరిత్రలో మరువలేని ఘట్టాలు. బెంగాల్ ప్రజాతంత్ర ఉద్యమాలలో కనక ముఖర్జీ, శ్యామిలీగార్లవంటి ఎందరెందరో మహిళా మణుల పాత్రలు మనకు మార్గదర్శకం.

మహనీయులందరు ప్రభోదించిన సమసమాజ నిర్మాణం కోసం ప్రజాతంత్ర ఉద్యమాలన్నింటా స్త్రీశక్తి ప్రత్యక్షంగా, పరోక్షంగా అంతర్లీనంగా ప్రముఖపాత్ర నిర్వహిస్తూనే ఉంటుంది. ఇది తరతరాల చరిత్ర చెప్పిన సత్యం.

అది 1994 జూన్. శ్యామిలీగుప్త వ్యవసాయ కార్మిక మహిళల స్థితిగతులపై సర్వే చేయుటకు విజయవాడ వచ్చిన సందర్భం. అప్పటికి 15రోజుల క్రితమే ప.గోదావరి జిల్లా ఏలూరు పట్టణంలో 16-5-1994వ తేది ఐద్వా నాయకురాలు మా ప్రియతమ సోదరి తాన సింహాచలం గూండాల చేతిలో అతి కిరాతకంగా నడిరోడ్డుపై సాయంత్రం 7గం॥ల సమయంలో హత్యకు గురైంది. ఏలూరులో సింహాచలం ఇల్లు చాడిదిబ్బ అనే పేటలో వుంది. ఎక్కడి నుండో గూండాల ముఠా వచ్చి క్లబ్బుపెట్టి నిత్యం త్రాగుళ్ళు, పేకాట, కనిపించిన ఆడపిల్లలను ఎత్తుకుపోయి అత్యాచారాలు చేయడంతో పేటలోని కుటుంబాలు అట్టుడికిపోతున్న భయానక వాతావరణం నెలకొంది. ఆ గూండాల వృత్తి కిరాయికి హత్యలు చేయటం. ఎవరూ నోరెత్తలేని భయంకర వాతావరణం.

ఐద్వా నాయకురాలైన మా సహచరి సింహాచలం చొరవతో ఆ పేటలోని పెద్దలు మున్సిపల్ కౌన్సిలర్, ఇతర రాజకీయ పార్టీ నాయకులందరినీ కలుసుకుని పేటలోని ఆ గుండాల క్లబుని తీసివేయాలని అర్థించింది.

పోలీసు సూపరిండెంట్‌గార్కి ఇచ్చిన మెమోరాండంపై ఇంటింటికి తిరిగి ప్రజలతో సంతకాలు సేకరించింది. అది గమనించిన ఆ గూండాల ముఠా ఆ రోజు సాయంత్రం 7గంllలకు ఆ పేటలోని తన ఇంటి పక్కవీధిలో నుండి నడిచి తను వస్తుంటే రోడ్డుపైనే హత్యచేశారు. ఉద్యమానికి అంకితమైన చైతన్యమూర్తి సింహాచలం. సమాజ క్షేమంకోసం 40 సంllల చిన్నవయసులో భర్త ముగ్గురు పిల్లలను వదిలి నిండు నూరేళ్ళ జీవితాన్ని బలి ఇచ్చింది.

ఆ సందర్భంలోనే వ్యవసాయ కార్మిక మహిళల స్థితిగతులు సర్వే చేయుటకు కలకత్తా నుండి విజయవాడ వచ్చిన ఐద్వా నేత శ్యామిలీగుప్త సింహాచలం హత్య సంగతి తెలిసి ఐద్వా రాష్ట్ర కార్యదర్శిగా ఉన్న పుణ్యవతిగార్ని తీసుకుని ఏలూరు వచ్చారు. అమరజీవి సింహాచలం స్థూపం దగ్గర ఆమె ప్రతిమను చూసి శల్యూట్‌చేసి చలించిపోయి, కళ్లనీళ్లు కార్చారు. తర్వాత సింహాచలం ఇంటికి వచ్చి రాగానే ఇంటి అరుగుమీద బైట కూర్చుండిపోయారు. ఇంటి బయటే ఉన్న వరండ గోడకి, ఎదురుగా మహనీయులు మార్చ్స్,ఎంగిల్స్, లెనిన్, స్టాలిన్ సుందరయ్యగార్ల ఫోటోలు పెద్ద సైజులో తగిలించి ఉన్నాయి. శ్యామిలీగారు ఆ ఫోటోలు చూసి ఇది పార్టీ కార్యాలయమా? అని అడిగారు. ఇంటినే మార్గదర్శులైన మహనీయుల ఫోటోలతో నింపి ఆ మార్గాన్నే ఎంచుకుంది సింహాచలం.

శ్యామిలీగారు హైదరబాద్‌లో జరిగిన సి.పి.యం పార్టీ జాతీయ మహాసభలకు వచ్చిన సందర్భంలో దగ్గరకు వెళ్ళి వలకరించి ఏలూరు ఆమె వచ్చిన సందర్భంలో సింహాచలం సంఘటన గుర్తు చేసాను. ఆక్కడ ఉద్యమ స్థితిని అడిగి తెల్సుకున్నారు.

ఆ దశకంలోనే (1997) పశ్చిమ గోదావరి జిల్లా ఏజన్సీ, మనుగోపుల గ్రామంలో గిరిజన యువతి కోరం పార్వతి (20సంll) ఇద్దరు బిడ్డల తల్లి తమ కష్టార్జితం పంటకొచ్చిన రెండెకరముల జొన్న చేను రక్షణకై జమిందారు తుపాకిగుళ్లకు ఎదిరించి నిలబడి బలైపోయింది. మరియు తమిళనాడులో ఐద్వా నాయకురాలు

**తరువాయి 32వ పేజీలో**

## అందం పోటీ

**(పాట, ఆదితాళం)**

**డా॥ డి.ఎల్ విద్య**

నీలీ నీలీ సంద్రం లాగ,
గగనం అగుపడుతున్నాదీ
నీటీ పైన తెప్పల్లాగ
మబ్బులు తేలుతు ఉన్నాయి.
నీరే లేని మబ్బులు చప్పున
తేలుతు సాగుతు ఉన్నాయా,
గగనం లోన తెప్పల్లాగ,
మబ్బులు తేలుతు ఉన్నాయి.
మబ్బుల్లోకి, మారీ మారీ,
మావా విహరిస్తున్నాడూ,
ఊరేగింపూ దారుల్లోనా,
మావా విహరిస్తున్నాడు.
చంద మావా విహరిస్తున్నాడూ,
పయనం సాగీ పోతోంది.

ఊరేగింపుకు మురిసీ, మురిసీ,
వెన్నెల వానను కురిసాడూ,
తెల్లని, చల్లని వెన్నెల ధారల
ధరణీ మాతను ముంచాడు.

నేలా పైనే కడలీ కెరటం
జాబిలి కూనను చూసిందీ
కూనను కౌగిలించుట కొరకూ
తుళ్ళీ తుళ్ళీ ఎగిరింది.

ఏటీ లోని నీటీ మట్టం
చంద్రుని కద్దం పట్టిందీ,
అద్దం లోన చందా మావని
కలువ భామ చూసింది.
పక్కన ఉన్న మావతో తాను
ఎంకీ పాటలు పాడింది.

ఏటీ గట్టూ ఎంకీ పాటలు
వినుటకు నిద్దరలేచిందీ,
గట్టూ మీదీ, చెట్టూ పుట్టను
పాటలు వినుటకు లేపింది.

గూటీ లోనీ పిట్టా నోటా,
ఎంకీ పాటా పలికిందీ,
గట్టూ, చెట్టూ, పుట్టా పిట్టా,
నీటితో తొంగీ చూశాయి.

నింగీ నేలా అందం అంతా
నీటిలో బింబాలయ్యాయి.
అందం చూసుకు, అంతాకలిసీ
ఎంకీ పాటలు పాడాయి.
దూరానున్న సంద్రం హోరూ,
నేపథ్యంగా మారింది.

నీటీలోనా సాటీలేని,
అందం పోటీ జరుగుతు ఉంది
వెన్నెల సాక్షిగా జరుగుతు ఉంది
కన్నుల పండగ చేస్తూ ఉంది.

లాహరి, లాహరి, లాహరి లోనా,
జగతీ తూగుతు, సోలుతు ఉంది.
ఊగుతు, తూగుతు, సోలుతు ఉండేది.
కలలను నిద్దర లేపుతు ఉంది.నీలాకాశం
చుక్కల తోటీ,
ఫక్కున నవ్వుతు ఉన్నాదీ,
చక్కగ నవ్వుతు ఉన్నాది,
చక చక్కగ నవ్వుతు ఉన్నాది.

జగతీ ఊగుతు ఉన్నాదీ,
చుక్కలు నవ్వుతు ఉన్నాయి.
జగతీ ఊగుతు ఉన్నాదీ,
చుక్కలు నవ్వుతు ఉన్నాయి.

వ్యాసం




# యువతపై మీడియా ప్రభావం

యువత చైతన్యానికి ప్రతీక. మీడియా సమాజంలోని చీకటి-వెలుగులను, సమస్తాన్ని ప్రజల దృష్టికి తెచ్చే సూర్యకిరణాలు.

మీడియా ఒక పదునైన ఆయుధం. యువతకు ఒక వరం. పూర్వం ఎంతో ప్రతిభ ఉన్న విద్యార్థులు, యువత అవకాశాలపై అవగాహన లేక తమ పరిధిలోనే జీవితాలను గడిపి వేసారు. కానీ ఎప్పుడైతే సోషల్ మీడియా, ఎలక్ట్రానిక్ మీడియా సమాజంలో ప్రవేశించాయో అప్పటినుండి యువతకు వారి ప్రతిభకు సరైన మార్గదర్శకాలయ్యాయి. తద్వారా వారి జీవనోపాధికి, ఉజ్వల భవిష్యత్తుకు ఎంతగానో దోహదపడ్డాయి. అంతే కాకుండా వ్యక్తిత్వ వికాసానికి, మెరుగైన జీవన విధానానికి మీడియా పాత్ర ఎంతైనా ఉంది.

గత పది సంవత్సరాలతో పోలీస్తే గ్రామీణ యువతలోని ఆలోచన విధానాలు, జీవనశైలి ఎంతగానో మార్పు చెందింది. దీనికి ప్రధాన కారణం మీడియా అనడంలో ఎంత మాత్రం సందేహం లేదు. మీడియా ద్వారా ప్రజలకు, యువతకు ప్రభుత్వ పరంగా అందుతున్న ఫీజ్ రీయంబర్స్‌మెంట్, ఉపాధి అవకాశాలు, ప్రభుత్వ పథకాలు, పాలనా విధానాలు మూర్తిగా అవగతమౌతున్నాయి. సోషల్ నెట్‌వర్కింగ్ సైట్లు చాలా త్వరగా యువతను ఆకట్టుకున్నాయి. యువత యొక్క ఆలోచనా విధానాల మార్పునకు, వారి అభిప్రాయాలను వ్యక్తపరచడానికి మీడియాను ఎంతగానో ఉపయోగించుకుంటున్నారు. మీడియా ద్వారా సమస్యల సాధనకు అవగాహన పెరిగింది. అవినీతిని నిర్మూలించటంలో అన్నాహజారే చేసిన ఉద్యమం గ్రామీణ స్థాయిలో చైతన్యం నింపటానికి (యువతలో) మీడియా పాత్ర పూర్తిగా ఉన్నది.

నేడు సమాజంలో యువత చేస్తున్న సామాజిక చైతన్య కార్యక్రమాలకు ప్రేరణ మీడియ ద్వారా వస్తున్న చర్చా కార్యక్రమాలు. నేడు మీడియా ప్రభావం వలన యువత అనేక రంగాలలో త్వరితగతిన అభివృద్ధి చెందుతుంది. దేశ ప్రగతికి యువత చైతన్యం ఎంతో అవసరం. అటువంటి చైతన్యాన్ని జాగృత పరచటంలో మీడియా కృషి అభినందనీయం. యువతకు తమయొక్క ఓటు హక్కును గూర్చి, వాటి యొక్క ఆవశ్యకతను గూర్చి తెలియజేయటంలో మీడియా ఎంతగానో పురోగతిని సాధించింది.

అయితే ఈ లాభాలతో పాటు ఈ యొక్క మీడియా నేటి యువతపై ఎన్నో దుష్పరిణామాలను చూపుతున్నది. విదేశీ ఛానల్స్ ప్రసారం వల్ల యువత నిర్వీర్యమవుతుంది. మన సంస్కృతిని విమర్శిస్తున్నారు. సినిమాల వ్యామోహం, అమ్మాయిల వ్యామోహం ఎక్కువై పెడదారి పడుతున్నారు. ఐక్యరాజ్య సమితి నివేదిక ప్రకారం యువతపై దుష్ప్రభావం చూపుతున్నాయని వెల్లడైంది. దీని యొక్క ఫలితమే అమ్మాయిలపై దురాగతాలు, యాసిడ్ దాడులు, అసభ్యకరమైన ప్రవర్తన. యువతీ యువకుల మధ్య బేధాలు పెరిగిపోవటం మొదలగునవి.

మన సమాజం ఒక భవనంగా తలచినట్లైతే మీడియా ఒక మూల స్తంభం వంటిది. కావున ముందుగా మనం చెప్పినట్లుగా మీడియా ఒక పదునైనా అస్త్రం. దానిని మంచికి ఉపయోగించినట్లయితే ఒక దీపంలా వెలుగును చూపి అభివృద్ధికి దారితీస్తుంది. అది కానట్లైయితే ఆ దీపమే మనలని కాల్చివేస్తుంది.

మన నవయువత తమకు సమాజం ఏమిచ్చిందని కాకుండా మనం సమాజానికి ఏమిచ్చామని అందరూ ఆలోచించాలి. మన దేశంలో మార్పు రావాలంటే అది కేవలం యువతకు మరియు మీడియాకు మాత్రమే సాధ్యం.

– మడిపెల్లి శ్రీదేవి

**(మార్చి8 అంతర్జాతీయ మహిళా దినోత్సవం సందర్భంగా ఐద్వా ఆదిలాబాద్ జిల్లా కమిటి ఆధ్వర్యంలో జరిగిన వక్తృత్వ పోటీలో బహుమతి పొందిన వ్యాసం)**

# సమగ్ర శిశు అభివృద్ధి కార్యాలయం

ఐసిడిఎస్ నర్సరావుపేట, గుంటూరు జిల్లా.

## శ్రీమతి బి.హెచ్. స్వర్ణలక్ష్మి కుమారి
సిడిపిఓ

### సూపర్‌వైజర్స్

పి. శారదా రాణి

ఐ. శైలజ

ఎం. జోజమ్మ

జె. ఆనంద కుమారి

కె. నిర్మల కృష్ణమాల

బి. ప్రసన్నరాణి

ఎస్. భారతి

డి. మరియ కుమారి

వి. అరుణ కుమారి,
సీనియర్ అసిస్టెంట్

కె. కవిత
జూనియర్ అసిస్టెంట్

బి. రూతురాణి
జూనియర్ అసిస్టెంట్

జి. బ్రహ్మయ్య
జూనియర్ అసిస్టెంట్

వి. మోహన్ రావు
జూనియర్ అసిస్టెంట్

శివ
డ్రైవర్

అవలోకనం

# మహిళలు - సోషలిజమ్ స్టడీ సర్కిల్

-కె. నాగలక్ష్మి

ఐద్వా రాష్ట్ర సెంటర్‌లో స్టడీ సర్కిల్ 13-3-10వ తేది నుండి ప్రారంభమై శ్రీమతి గౌరి కన్వీనర్‌గా సరాసరిన 12నుండి 18మంది మహిళల హాజరుతో నడుస్తున్నది. మహిళలకు సంబంధించిన వివిధ సమకాలీన అంశాలు, సైద్ధాంతిక పుస్తకాలతోపాటు వివిధ అంశాలతో ఈ స్టడీ సర్కిల్ నిర్వహణ జరుగుతున్నది.

స్టడి సర్కిల్ ద్వారా ఆసక్తికరమైన చర్చలు నిర్వహించి వివిధ అంశాలపై అవగాహన పెంపొందించుకోవడానికి అవకాశం కలుగుతుంది. ఇంతకు ముందుకంటే మెరుగుగా వివిధ అంశాలపై పట్టుసాధించడమే కాక చర్చలు నిర్వహించే సామర్థ్యంతోపాటు, మాట్లాడేందుకు, అభిప్రాయాలు వ్యక్తం చేయడానికి బాగా ఉపయోగపడుతున్నదని సభ్యులందరి అభిప్రాయం.

గత 6 నెలల నుండి ఆగస్ట్‌బెబెల్ రచించిన "మహిళలు-సోషలిజం" అనే పుస్తకం పై స్టడీ సర్కిల్‌లో చర్చసాగింది. సభ్యులందరూ పుస్తకం చదివి దానిపై చర్చలు జరిపారు. చర్చల్లో వచ్చిన అంశాలు. పెట్టుబడిదారీ సమాజంలో స్త్రీల పరిస్థితులపై చేసిన అధ్యయనం ద్వారా ఆయన రాసిన ఈ గ్రంథం 100 సం౹౹ క్రితం వ్రాసినదైనా ఇప్పటికీ మన దేశంలో నడుస్తున్న చరిత్రను చదువుతున్నట్లు వున్నదని సభ్యులు అభిప్రాయ పడ్డారు.

మానవజాతి ప్రారంభంనుంచి స్త్రీ స్థానం ఎలావుంది? సోషలిస్టు సమాజాలలో స్త్రీ స్థానం ఎలావుంటుంది అని చారిత్రిక భౌతికవాద దృష్టితో బెబెల్ ఈ గ్రంథాన్ని రచించారు. ఏంగెల్స్ వ్రాసిన కుటుంబం-వ్యక్తిగత ఆస్తి, రాజ్యాలపుట్టుక ప్రాతిపదికగా మహిళల అణచివేతపై బెబెల్ మరింత అధ్యయనం చేశారు. మహిళల అణచివేతకు మూలాలు స్వంత ఆస్తిపై ఆధారపడిన వర్గ సమాజంలోనూ, లైంగిక శ్రమ విభజనలోనూ కనిపిస్తాయి. ఉత్పత్తి శక్తులు,



ఉత్పత్తి సంబంధాలలో మార్పుల వల్ల సమాజాలు మారాయి. ఆ విధంగా స్త్రీ పురుష సంబంధాలలో కూడా మార్పులు సంభవించాయి. మహిళలు ఒకవైపు పురుషుడిపై సాంఘికంగా ,ఆర్థికంగా ఆధారపడాల్సిరావడం మరోవైపు సమాజంలో వున్న తక్కువ స్థానం వారిని అణచివేశాయి.

స్త్రీ పురుషుల మధ్య సమానత్వం లేకుండా మానవజాతికి విముక్తి లేదనీ, జనాభాలో సగభాగం అభివృద్ధి కాకుండా సమాజం ముందుకు పోజాలదు అని చెప్పారు.

సమాజ పరిణామ క్రమంలో ఉత్పత్తిలో మిగులు ఏర్పడడం, ఆ మిగులుతో స్వంత ఆస్తి రావడం ఆ స్వంత ఆస్తిని వారసులకు పంచాలనే క్రమంలో స్త్రీ పురుషుల మధ్య లైంగిక సంబంధాలలో మార్పులు ఏర్పడి జంట వివాహ పద్ధతులు వచ్చాయి. దీనితో పురాతన కాలంలోవున్న సమాన హక్కులు హరించబడి మాతృస్వామ్య వ్యవస్థ స్థానంలో పితృస్వామ్య వ్యవస్థ ఏర్పడింది. మాతృస్వామ్య వ్యవస్థలో సమ సమాజముంటే, పితృస్వామ్య వ్యవస్థలో స్వంత ఆస్తి, మహిళల బానిసత్వం తెరమీదికి వచ్చాయి. క్రమంగా జీవమున్న అన్ని ప్రాణుల్లోకీ ఆడవారి బ్రతుకు ఎంత నీచంగా మారిందో అర్థమైంది.

మతాలు, మత గ్రంధాలు కూడా స్త్రీని స్వాతంత్ర్యానికి అర్హతలేనిదిగా ప్రభోదించాయి. క్రైస్తవ మతం ప్రకారం స్త్రీ అపవిత్రం, ప్రపంచంలో పాపాన్ని తీసుకొని వచ్చి పురుషుల్ని ప్రలోభపెట్టి వినాశనం వైపు నడిపించేదని చెబుతుంది. ఇలాంటి సిద్ధాంతాలు క్రైస్తవ మతంతోపాటు యూదు, గ్రీకు, హిందూ మతాల్లోనూ వున్నాయి. బైబిల్‌లోని పదవ ఆజ్ఞ స్త్రీలను పరిచారికలుగా, పెంపుడు జంతువులుగా చెబుతుంది. భూస్వామ్య వ్యవస్థలో మహిళలు భూస్వాముల అకృత్యాలకు బలికావలసి వచ్చింది. క్రమంగా లూథర్‌కింగ్ లాంటి సంస్కరణ వాదులు కొన్ని సంస్కరణల ద్వారా స్త్రీలకు కొంత స్వేచ్ఛ కల్పించారు. యుద్ధాలలో జననష్టం జరిగినపుడు జనాభా పెంపుదల కోసం బహుభార్యాత్వాన్ని అమలు చేశారు. దీనితో పురుషులు నైతికంగా దిగజారారు.

పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెందిన కొలదీ ఉత్పత్తి విధానంలో విప్లవాత్మక మార్పులొచ్చాయి. భారీగా ఉత్పత్తి

చేయడానికి పెద్ద సంఖ్యలో కార్మికులు అవసరమయ్యారు. దీనితో మహిళలుకూడా ఉత్పత్తిలో పాల్గొనాల్సివచ్చింది. 18వ శతాబ్ది అంతానికి ఇంగ్లండ్, స్కాట్లండ్‌లలో లక్షల మంది మహిళలు, పిల్లలు జౌళి పరిశ్రమల్లో పనిచేశారు. మహిళలకు ఉపాధి దొరికినా బూర్జువా సమాజంలో స్త్రీ ద్వితీయ స్థానంలోనే వుంది. కనుక ఫ్రాన్స్ లాంటి దేశాల్లో కూడా మహిళల పట్ల పనిగంటల్లో, వేతనాల్లో వివక్షత వుండేది. వ్యాపారదృష్టి కలిగిన పెట్టుబడిదారీ సమాజంలో పరస్పర ప్రేమతో వుండాల్సిన వివాహాల స్థానంలో కూడా వ్యాపార దృష్టి ఏర్పడింది. ఇది ఈనాటికీ వర్తమాన ప్రపంచంలో చూస్తున్నాము. ఆర్థిక పరిస్థితులే వివాహాలను నిర్ణయిస్తున్నాయి.

మహిళలకు విడాకుల చట్టం కూడా లేదు. జర్మనీలో, ఫ్రాన్స్‌లో 1884 వరకు విడాకుల చట్టం లేదు. క్రమంగా విడాకుల చట్టం వచ్చింది. అమెరికాలో విడాకులు ఎక్కువగా నమోదవడానికి కారణం అక్కడ సులువైన విడాకుల చట్టం వుండడం మరియు స్త్రీలు కొంత స్వేచ్ఛ కలిగి వుండి భర్తల నిరంకుశత్వాన్ని ఎదిరించడం కారణంగా చెబుతారు.

పారిశ్రామిక సంక్షోభాలు ఉపాధిని దెబ్బతీసినపుడుకూడా శ్రామిక మహిళల పైనే వేటు పడుతుంది. ముందుగా వారినే పనిలోనుండి తొలగించడం, తక్కువ వేతనాలు చెల్లించడం చేస్తున్నారు. దోపిడి చేయడానికి స్త్రీలు అణకువగా వుంటారు కనుక వారిని అవసరాలకనుగుణంగా వాడుకోవడం జరుగుతుంది. మహిళలకు ఉపాధి తగ్గినకొద్దీ పెళ్ళి ఒక జీవనాధారంగా భావించసాగారు. స్త్రీలకు నిజమైన ఉద్యోగం వివాహమేననే పరిస్థితులు వచ్చాయి. పెళ్లి అనేది నిజమైన ప్రయోజనాన్ని కోల్పోయింది. బూర్జువా సమాజంలో పారిశ్రామిక సంక్షోభాలు వచ్చినపుడు వివాహాలు తగ్గి వ్యభిచారం, వేశ్యవృత్తి పెరిగాయి. స్త్రీల పరిస్థితి మరింత దిగజారింది.

వివాహిత మహిళలు మరింత అణకువగా వుంటారని తెలుసుకున్న బూర్జువా వర్గం వారికి పనిదినాలను పొడిగించి తక్కువ వేతనాలిచ్చి దోపిడీ చేశారు. తపాలా, విద్యా సర్వీసుల్లో కూడా సమానవేతనం ఉండేదికాదు. 1891లో జర్మన్ ఫ్యాక్టరీ చట్టం వచ్చిన తరువాత కార్మికుల పనిదినం 11గం॥లు చేశారు. 1908 డిసెంబర్‌లో 10గంటల పనిదినం వచ్చింది. అప్పుడే మహిళలకు కాన్పుకు ముందు వెనుక 8 వారాల సెలవు ప్రకటించారు. 19వ శతాబ్దం చివరి నుండి స్త్రీలు పురుషులతో పోటీపడే అవకాశం వచ్చింది. క్రమంగా మహిళలు ఉన్నత విద్యలో, వైద్య వృత్తిలో ప్రవేశించారు. న్యాయపర హక్కులకోసం పోరాటాలు చేశారు. 1905లో రష్యా విప్లవ పోరాటంలో మహిళలకు ఓటు హక్కు కల్పించారు. క్రమంగా మిగిలిన దేశాల్లో ఓటు హక్కు వచ్చింది. అయినప్పటికీ గర్భిణీ స్త్రీని పార్లమెంటులో సహించలేమంటూ అపహాస్యం చేసేవారున్నారు. నేటికీ మన పార్లమెంటులో రిజర్వేషన్ బిల్లు ఏ పరిస్థితిలో వుందో మనం చూస్తున్నాము.

పెట్టుబడిదారీ సమాజంలో అసమానతలకు, వివక్షతకు దోపిడికి గురవుతున్న మహిళలకు సోషలిస్టు సమాజంలోనే విముక్తి లభిస్తుందని బెబెల్ చెప్పిన మాట అక్షర సత్యమని సభ్యులు అభిప్రాయపడ్డారు.

సోషలిస్టు సమాజంలో ఉత్పత్తి సాధనాలు ఉమ్మడి ఆస్తిగా సమాజపరమవుతాయి. స్వంత ఆస్తి లేదు కనుక దోపిడి ఉండదు. ఉత్పాదకశక్తిలో పెరుగుదల, సులువైన పని విధానంతో పనిగంటలు బాగా తగ్గుతాయి. శారీరక శ్రమ, వ్యాయామం, మనోవికాసం జరుగుతాయి. వినియోగానికి సరిపడా ఉత్పత్తి జరుగుతుంది. కానీ లాభాలకోసం కాదు. ప్రణాళికాబద్ధ ఉత్పత్తి జరుగుతుంది కనుక సంక్షోభాలకు తావులేదు. సమాన విద్యావకాశాలు వుంటాయి. మానవుడు అన్ని రంగాల్లో పురోగమిస్తాడు. వ్యక్తి పరిపూర్ణ వికాసం జరుగుతుంది. మహిళలకు అనేక వెసులుబాట్లు కలుగుతాయి. ఉమ్మడి వంటగది, లాండ్రీలు, పిల్లల సంరక్షణ, వృద్ధుల సంరక్షణ మహిళల భారాన్ని తగ్గిస్తాయి అనే అంశాలు చర్చకు వచ్చినపుడు స్టడీ సర్కిల్ సభ్యులందరూ చాలా ఉద్విగ్నత, ఉత్సుకతతో చర్చల్లో పాలు పంచుకున్నారు. 'సోవియట్ యూనియన్' మహిళలకు కల్పించిన అనేక సౌకర్యాలను నెమరు వేసుకున్నాము. నేటి పెట్టుబడిదారి వ్యవస్థ రష్యా, మహిళల సంక్షేమాన్ని పూర్తిగా పక్కకు నెట్టిన విధానాన్ని స్టడీ సర్కిల్ సభ్యులు చర్చించారు.

ఒకవర్గాన్ని పరాధీనంలో వుంచితే మానవజాతి పురోగమించజాలదని బెబెల్ చెబుతారు. కనుక తన విముక్తి కోసం, విమోచన కోసం సాగే పోరాటంలో మహిళలు భాగస్వాములు కావాలని బెబెల్ పిలుపునిస్తారు. సామాజిక మార్పుకై సాగుతున్న పోరాటంలో మహిళలు తమ పాత్రను అర్థం చేసుకోవాలని చెబుతారు. మానవజాతి అభ్యుదయం కోసం సాగే మహోద్యమంలో ఏ శక్తినీ, అదెంత బలహీనంగా వున్నప్పటికీ వదులుకోకూడదని ఒక్కొక్క బొట్టు నిరంతరాయంగా పడుతూ ఎంతటి బండరాయయినా బద్దలు కావాల్సిందేననీ, బొట్టు బొట్టు కలిసి సెలయేరులై సెలయేరులన్నీ కలిసి నదీ ప్రవాహంగా మారితే ఆ ప్రవాహ ఉధృతిని ఆపటం ఎవరి తరమూకాదనీ, మానవజాతి అభ్యుదయానికీ ఈ సూత్రం వర్తిస్తుందనీ, కర్తవ్య దీక్షతో అంతిమ విజయం సాధించాలనీ బెబెల్ చెప్పిన మాటలు అందరూ అన్వయించుకొని మాట్లాడారు. సామాజిక మార్పు కోసం జరిగే పోరాటంలో మన వంతు పాత్రను మనం నిర్వహించాలని, సోషలిజంతోనే మహిళా సమస్యలకు శాస్త్రీయమైన పరిష్కారం దొరుకుతుందని ఏకాభిప్రాయానికి వచ్చారు. ●

హింస

# అభయ, నిర్భయలేకాదు.... యాదమ్మలూ మహిళలే.....

- రవిరాజా

**ఏప్రిల్ 28, 2014న మెదక్ జిల్లా తునికి బొల్లారం గ్రామంలో ఒంటరి మహిళ యాదమ్మపై జరిగిన పైశాచిక ఘటన సభ్య సమాజాన్ని దిగ్భ్రాంతి పరిచింది. స్వంత బావ భిక్షపతి, అతని కొడుకు కనకయ్యతోపాటు మరో ముగ్గురు గ్రామస్తులు కలిసి సామూహిక అత్యాచారం జరిపి అత్యంత కిరాతకంగా ఆమె శరీరభాగాలను ఛిద్రం చేసి కొట్టి చంపారు. పురుగుల మందు తాగి ఆత్మహత్య చేసుకున్నట్లు కథనాలు సృష్టించారు. పోస్ట్ మార్టమ్ చేసిన డాక్టర్ కూడా ఆమె స్తనాల్లో బ్లేడులు, మర్మాంగంలో ఇటుక పెడ్డలు ఉన్నాయని చెప్పారు. ఆ గ్రామ మహిళలు, పురుషులు ఐద్వాతోపాటు ఇతర ప్రజా సంఘాలు, ఆందోళన చేపట్టినా కేసు పక్కతోవ పట్టిస్తున్నారు. యాదమ్మ ఘటనపై మీడియాతోపాటు ఇతర ప్రజాసంఘాల స్పందన సరిగా లేదు. గ్రామీణ భారతానికి ప్రతీకగా ఉన్న యాదమ్మ కేసు ఎవరికీ పట్టని నేపథ్యంలో...**

అభయపైన అత్యాచారానికి ఒడిగట్టిన మృగాలకు న్యాయస్థానం వేగంగా విచారణ ముగించి శిక్షలు వేయటం ఒకింత ఊరట కలిగించింది. ఆ మేరకు ఆహ్వానించదగిన విషయం. కానీ ఇక్కడ కొన్ని ప్రశ్నలకు సమాధానాలు వెతకాల్సి ఉంది. అభయ, నిర్భయల పట్ల స్పందించిన ప్రభుత్వ యంత్రాంగం, నాయకులు సభ్యసమాజానికే మచ్చతెచ్చే తునికి బొల్లారం 'యాదమ్మ' ఘటనపై ఎందుకు స్పందించలేదు...? సమాచారం లేకా...? అయితే ప్రజాశక్తి, 10 టివిలలో వరుస కథనాల తర్వాత కూడా ఎందుకు చలించలేదు...? ఢిల్లీ నడిబొడ్డున నిర్భయ ఘటన దేశాన్ని కుదిపివేసింది. హైదరాబాద్ నగరంలో అభయ ఘటనతో సభ్యసమాజం తల్లడిల్లింది. మహానగరాల్లో ఉన్నత చదువులు చదువుతున్న వీరి పట్ల స్పందించిన సమాజం యాదమ్మను ఎందుకు విస్మరించింది...? పురుగుల మందు తాగి ఆత్మహత్య చేసుకున్నదని ఆస్పత్రికి తరలించారు. పోస్టుమార్టం చేసిన మహిళా డాక్టరు పురుగుల మందు తాగితే పాలిండ్లలో బ్లేడు ముక్కలు ఎందుకున్నాయని ప్రశ్నించింది. మర్మాంగంలో ఇనుప చువ్వల గాయాలెందుకున్నాయని నిలదీసింది. పురుగుల మందు తాగితే ఒంటినిండా గాయాలెందుకవుతాయని అడిగింది. గ్రామస్తులు సమాధానం చెప్పలేక తలవంచుకున్నారు. ఇన్ని ప్రశ్నలను సంధించిన డాక్టరు పోస్టుమార్టం నివేదికలో ఈ వాస్తవాలన్నీ పొందు పర్చారా...? ఆ రిపోర్టులో ఏముందో అధికారులు ఎందుకు చెప్పటం లేదు...?

నిజానికి యాదమ్మ ఘటనతో గ్రామం విలవిలలాడింది. ఐకెపి మహిళలు పోలీస్‌స్టేషన్ ముందు ఆందోళనకు దిగారు. నిజాలు తేల్చే వరకు అంత్యక్రియలు జరగడానికి వీల్లేదని అడ్డగించారు. యాదమ్మ బతుకిట్లయిన తర్వాత ఊళ్ళో ఒంటరి మహిళల గతేమిటని నిలదీశారు. అయినా వారి నోరు మూయించారు. మళ్లీ పోస్టుమార్టం చేయాలన్న డిమాండ్‌కు అవకాశం లేకుండా శవాన్ని దహనం చేశారు. ఈ విషయాలు మీడియాకెక్కిన తర్వాతనైనా అధికార పార్టీగానీ, గతంలో అధికారం వెలగబెట్టిన వారుగానీ, రాబోయే కాలంలో అధికారం మాదే అంటున్నవారు గానీ స్పందించలేదు. అనేక ప్రజాసంఘాలు, స్వచ్ఛంద సంస్థలూ చూసీచూడనట్లు వదిలేశాయి. రక్తపు మరకలు చూపించిన గ్రామస్తులతో 'ఇది మనిషి రక్తమే అని ఎందుకనుకోవాలి? మేక రక్తం ఎందుకు కాకూడదు?' అని ఎస్ఐ వాదించాడు. విచారణ కోసం వచ్చిన సిఐ "రేప్ జరిగిందంటున్నారు. మీరు చూశారా...? మీరు చూశారా.....?" అంటూ గ్రామస్తులను గుచ్చిగుచ్చి ప్రశ్నించాడు. ఇంతకన్నా హేయమైనదేమైనా ఉంటుందా...?

పైగా ఈ వార్తలు ఒక్కొక్కటిగా బయటపడుతుంటే 'చిన్న విషయాన్ని పెద్దది చేస్తున్నారు' అని స్పందించిన వారూ ఉన్నారు. 'బావకు లొంగిపోయింది కదా...! ఇంత రాద్ధాంతం అవసరమా..?' అని అన్నవాళ్లూ ఉన్నారు. ఒంటరి మరదలు ఆస్తిని గుప్పిట్లో పెట్టుకుని లొంగదీసుకున్న పురుష దురహంకారాన్ని ప్రశ్నించాల్సిందిపోయి, నిస్సహాయ స్థితిలో ఉన్న మహిళను చులకన చేయటమేనా


ఆందోళనకు దిగిన ఐకెపి మహిళలు




సభ్యసమాజం చేయాల్సింది...? దిక్కులేని స్థితిలో ఉన్న మహిళను ఎవరైనా వాడుకోవచ్చునా...? సామూహికంగా అత్యాచారం చేసి పైశాచికంగా హత్య చేయవచ్చా...? 21వ శతాబ్దంలో కూడా ఇంతటి వికృతవాదనలకు ఎందుకు అవకాశమిస్తున్నాం...?

ఇలాంటి అత్యాచారాలు ఒక్క తునికి బొల్లారంలోనేనా...? గ్రామీణ ప్రాంతాల్లో కోకొల్లలుగా జరుగుతున్నప్పటికీ వెలుగులోకి రాకుండా తొక్కేస్తున్నారు. మహిళాలోకంపై కిరాతక దాడుల విజృంభణకు వ్యవస్థాగత వైఫల్యమెలా తోడ్పడుతుందో యాదమ్మ ఘటనే నిలువెత్తు ఉదాహరణ. స్త్రీలపై ఎటువంటి నేరాలకు ఒడిగట్టినా కఠోరశిక్ష విధించాల్సిందేనని సర్వోన్నత న్యాయస్థానం ఎప్పుడో సృష్టీకరించింది. హడలెత్తుతున్న అత్యాచార సంఘటనలపై జాతీయ మహిళా కమిషన్ నిర్దిష్ట సూచనలు చేసింది. నిత్యకృత్యమైన ఇటువంటి ఘోర దురంతాలపై ప్రభుత్వాలు చురుగ్గా వ్యవహరించాల్సి ఉందని రాష్ట్ర మానవహక్కుల సంఘం నొక్కి చెప్పింది. చట్టాలు కఠినంగా లేకపోవడం వల్లనే మహిళలపై దాడులు పెరుగుతున్నాయనేది పచ్చినిజం.

సర్వం వ్యాపారమైన సమాజంలో మహిళలపైన అత్యాచారాల విషయంలో కూడా చదువులు, ఆర్థిక స్థితిగతులు, నివసించే ప్రాంతాలను బట్టి విలువలు మారుతాయా...? మారుతాయనే ఈ ఘటనలు రుజువు చేస్తున్నాయి. యాదమ్మ చదువుకోలేదు. పేదరాలు, బడుగుబలహీన వర్గాల కుటుంబీకురాలు. పైగా ఒంటరి మహిళ కూడా. ఆమెకు కూడా విలువ కట్టాలా అంటున్నాయి పురుషాధిక్య సమాజపు 'విలువలు'. నిర్భయ, అభయల పట్ల కూడా అంత సులభంగా ప్రభుత్వ యంత్రాంగం కదలలేదు. జనం తీవ్ర నిరసనోద్యమాల్లోకి వచ్చి నిలదీసిన తర్వాతనే పాలకుల్లో చలనం మొదలైంది. దాని ప్రభావంతోనే అభయ కేసు కూడా వేగంగా కదిలింది.

అగ్రవర్ణ పెత్తందారీతనం బిసిలను చిన్న చూపు చూస్తోంది. బిసిలు, దళితులు, గిరిజనులను తక్కువగా పరిగణిస్తున్నారు. భూస్వామి వ్యవసాయ కూలీల మీద పెత్తనం చెలాయిస్తున్నాడు. అందుకే ఒక మహనీయుడు మహిళను బానిసకు బానిసగా అభివర్ణించాడు. ఇప్పుడు మార్కెట్ సమాజం పేరుతో మహిళను వ్యాపారమయంగా మార్చారు. వీటి పర్యవసానాలే కదా మహిళల మీద పెరుగుతున్న అత్యాచారాలు, దాడులు, అణచివేతలు, యాసిడ్‌దాడులు, పైశాచిక హత్యలు...? అందుకే ఢిల్లీ పురవీధుల్లో ప్రజల ప్రతిఘటన. 'పగలూ మాదే... రాత్రీ మాదే...' అని భాగ్యనగరపు నడిబొడ్డున అర్థరాత్రి నినదించిన స్త్రీ, పురుషుల చైతన్యం కావాలిప్పుడు. ●

26వ పేజీ తరువాయి

లీలావతి మంచినీళ్ల అక్రమ వ్యాపారాన్ని ఎదిరించి ఆ దోపిడీ శక్తుల చేతిలో బలైపోయింది. పశ్చిమ బెంగాల్, త్రిపుర రాష్ట్రాల్లో సమాజ సేవలో మహిళల బలిదానాలు ఇంకా ఎన్నెన్నో.

కనకముఖర్జీ, పాపా ఉమానాథ్, అహల్య రంగ్నేకర్, సుశీలా గోపాలన్, విమలారణదీవె, గోదావరి పెరులేకర్, కెప్టెన్ లక్ష్మిసెహగల్, మానికొండ సూర్యావతి, మోటూరి ఉదయం, శ్యామిలీగుప్త మొదలైన మహానేతలెందరో ప్రజాతంత్ర ఉద్యమంలో చూపిన బాటలే ఈనాటి ఉద్యమాలలో కార్యకర్తలకు మార్గదర్శకం. అమరజీవి శ్యామిలీగార్కి ప్రజాతంత్ర ఉద్యమం నివాళులర్పిస్తోంది.

**ఐద్వా విశాఖ జిల్లా కార్యాలయం ప్రారంభోత్సవం 13.04.2014న జరిగింది.**



# భారతదేశంలో మహిళా కార్మికుల పని తీరు -పరిష్కారాలు

## మే1, కార్మిక దినోత్సవం సందర్భంగా

-జయతి ఘోష్

పెట్టుబడిదారీ వ్యవస్థ వున్న ప్రాంతాలలో అమలవుతున్న కార్మిక వ్యవస్థను తెలుసుకోకుండా ప్రపంచంలో గాని, ముఖ్యంగా భారతదేశంలో గాని మహిళా కార్మికుల పరిస్థితులను మనం అవగాహన చేసుకోలేము. పెట్టుబడిదారీ వ్యవస్థ చరిత్ర పరిశీలిస్తే ప్రతి సందర్భంలోనూ అక్కడ వున్న కార్మిక సప్లైని పెట్టుబడిదారుల యొక్క డిమాండ్‌కి అనుగుణంగా మలచుకొని వస్తున్నారు. ముఖ్యంగా మహిళా కార్మికులని డిమాండ్ ఆధారంగా సప్లై చేశారు. పెట్టుబడిదారీ వ్యవస్థ ప్రారంభమైన నాటినుంచే మహిళా కార్మికులను కూడా కార్మికవర్గంలో భాగంగా చూడటం ప్రారంభించారు. అయితే వారి శ్రమని గుర్తించడం, వేతనాలు చెల్లించడం, వారి ఉత్పాదకతని సమాజ ఎదుగుదలకి ఉపయోగపడినదిగా అంతగా గుర్తించలేదనే చెప్పవచ్చును. మహిళలు అందరూ కార్మికులే. వారి శ్రమని వివిధ రూపాలలో చేసేవారు. సమాజ శ్రేయస్సు కొరకు, వేతన రహిత పని. ఉదా:- వంట చేయడం, శుభ్రపరచడం, ఇంటిపని, పిల్లలపెంపకం, ముసలివారిని, అనారోగ్యంతో ఉన్న వారిని, ఇతర సమాజ కార్యకలాపాలలో వారు ప్రముఖపాత్ర నిర్వహించేవారు. ఇదంతా మహిళల యొక్క బాధ్యతగానే గుర్తించేవారు. కొంతమంది పేద మహిళలు జీతానికి పనిచేసినా వారికి ఇంటిపని బాధ్యత తప్పేదికాదు. వారి వేతనానికి విలువనిచ్చేవారు కాదు. అనేక సందర్భాల్లో ఇంటిబాధ్యత ఇంట్లో వున్న ఆడపిల్లలపై పడేది. ఈ విధంగా రెండు విధాల బాధ్యత మహిళలపైనే ఉండేది. ఇదంతా కాపిటలిజం యొక్క అంతర్గత విధానమే. పెట్టుబడిని కూడ బెట్టడానికి మారకపు విలువ కొరకు మహిళా కార్మికుల యొక్క శ్రమ అవసరమే అయ్యింది. ఈ మధ్య కాలంలో మార్కెట్ అవసరాలకి మహిళా కార్మికులని ఉపయోగించడం ఎక్కువైంది.

మహిళా కార్మికుల ఉద్యోగం, పురుష కార్మికుల ఉద్యోగానికి చాలా తేడా వున్నది. మహిళా కార్మికులపై రెండు వైపుల భారం పడేది. వారి యొక్క జీతాలు పెరిగినంత మాత్రాన అన్ని సమస్యలు తీరిపోలేదు. రెండవ వైపు వున్నటువంటి గృహ బాధ్యతల నుండి విముక్తి కలగలేదు. అందువలన ఈ సమస్య పరిష్కారం వైపుగా ఆలోచనలు సారించక పోతే మహిళా కార్మికుల బాధ్యత, బరువు ఇంకా పెరుగుతున్నదే తప్ప తగ్గుముఖం పట్టడంలేదు. ఈ సమస్య పరిష్కారం వైపుగా ఆలోచన చేయగా ముఖ్యంగా అభివృద్ధి చెందుతున్న దేశాలలో వున్న మహిళా కార్మికుల పరిస్థితి, ప్రత్యామ్నాయ మార్గాల ద్వారా వారి యొక్క బాధ్యతను తగ్గించాలి. ఇంటిపనికి, పిల్లలపెంపకం ఈ రెండింటిని పరిష్కరించే వరకు ఈ బాధ్యత మహిళా కార్మికుల పైనే ఉంటుంది. దీని వలన సాంఘిక సంబంధాల పైన, ఆర్థిక విధానాలపైన ప్రభావం పడుతున్నది. ఈ ప్రభావం వలన మహిళాకార్మికుల యొక్క పెరుగుతున్న మార్కెట్ కార్యకలాపాలలో, నిజమైన మెరుగుదల కనిపించాలంటే మహిళల ఆర్థిక పరిస్థితులలో మార్పులు రావల్సిన అవసరం వున్నది. ఈ ద్వంద్వ మార్పులు జరగనంతవరకు మహిళా కార్మికులపై భారం అధికమవుతూనే ఉంటుంది.

ఇతర అభివృద్ధి చెందిన దేశాలలో వలెనే మన భారతదేశంలో కూడా మహిళా కార్మికుల పరిస్థితులపై కాపిటలిజమ్ ప్రభావం పడుతూనే వున్నది. పెట్టుబడిలో అదనపు విలువ కొరకు మహిళా కార్మికుల అవసరం కనిపించింది. జీతంలేని కార్మికులుగా , కాపిటలిస్టు ముఖ్యమైన అవసరంగా వున్న రిజర్వ్ ఆర్మీగా మహిళాకార్మికులని ఉపయోగించుతున్నారు. ఈ క్రమంలోనే మహిళలపై పురుషుల ఆధిపత్యం నిలబెట్టుకుంటూనే మహిళల శ్రమని మరింతగా దోచుకోవడం, పెట్టుబడిదారీ సమాజానికి మహిళల శ్రమశక్తిని వినియోగించుకోవడం పెరిగింది.

ఉదా:-పనిగంటల పెంపుదల, జీతాలలో కోతలు వలన అదనపు విలువ పెరుగుదల జరిగింది. పీస్‌రేటు పని విధానం దీనివలన సూపర్‌విజన్ బాధ్యత తగ్గింది. పితృస్వామ్య వ్యవస్థను కాపాడుతూనే రెండవ వైపు పెట్టుబడిదారీ విధానం బలపడింది.

పై విషయాల వలన మనకి భారతదేశంలో మహిళా కార్మికుల యొక్క

**భారతదేశంలో మహిళా కార్మికుల యొక్క పరిస్థితులు అవగతం అవుతున్నాయి. మహిళల పనిని గుర్తిస్తూనే నాలుగు రకాలైన వైరుధ్యాలు కనిపిస్తున్నాయి. ఒకవైపు జీతం ఇచ్చే మహిళా కార్మికుల సంఖ్య పెంచారు, తక్కువ జీతాలు ఇవ్వడం, జీతంలేని కార్మికులు, బహిరంగంగానే మహిళా నిరుద్యోగం పెరిగింది. ఇది మరింతగా తెలుసు కోవాలంటే స్థూల ఆర్థిక విధానం ఏరకంగా పెట్టుబడిదారులు అనుసరిస్తున్నారో పరిశీలించాల్సి వున్నది.**

**భారతదేశం లాంటి మిశ్రమ ఆర్థిక వ్యవస్థ వున్న చోట మహిళా కార్మికుల పని, స్థితిగతులను అంచనావేయడం చాలా కష్టమైన పని. అదనపు విలువ సంపాదించుటకే పెట్టుబడిదారులకి, కార్మికుల స్థితిగతులు మెరుగుపర్చాలనే ఆలోచన రాదు. ఆర్థిక అసమానతలు, సాంఘిక అసమానతలు, ప్రాంతీయ అసమానతల ఇంకా పెంచుతూనే వుంటారు. దీనివలన కార్మికులకు మెరుగైన వేతనాలు ఇవ్వరు. దీనికి తోడుగా మహిళలు పురుషాధిక్యతని కూడా ఎదుర్కోవలసి వస్తున్నది.**

పరిస్థితులు అవగతం అవుతున్నాయి. మహిళల పనిని గుర్తిస్తూనే నాలుగు రకాలైన వైరుధ్యాలు కనిపిస్తున్నాయి. ఒకవైపు జీతం ఇచ్చే మహిళా కార్మికుల సంఖ్య పెంచారు, తక్కువ జీతాలు ఇవ్వడం, జీతంలేని కార్మికులు, బహిరంగంగానే మహిళా నిరుద్యోగం పెరిగింది. ఇది మరింతగా తెలుసు కోవాలంటే స్థూల ఆర్థిక విధానం ఏరకంగా పెట్టుబడిదారులు అనుసరిస్తున్నారో పరిశీలించాల్సి వున్నది.

భారత దేశ ఆర్థిక వ్యవస్థ ప్రపంచ ఆర్థిక వ్యవస్థతో పోల్చితే కొంత వరకు విజయవంతమైనదనే చెప్పవచ్చును. ఇతర దేశాల వలే ఆర్థిక సంక్షోభం రాలేదు. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత మనం అనుసరించిన ఆర్థిక విధానమైన మిక్స్‌డ్ విధానమే పరిశ్రమ దారరహితంగా జరిగింది. గత 25సం॥లలో జి.డి.పి. అభివృద్ధి చెందింది. ఇతర అభివృద్ధి చెందుతున్న దేశాలకన్నా మెరుగైన ఆర్థిక పరిస్థితి ఇండియాలో వున్నది. అయినప్పటికి దీర్ఘకాలంగా పరిశీస్తే కొన్ని అపజయాలు కూడా వున్నాయి.

ముఖ్యంగా కార్మిక శక్తిని తక్కువ ఉత్పాదక కార్యక్రమాల నుంచి తొలగించలేక పోవడం, ముఖ్యంగా వ్యవసాయ రంగంలో, ఎక్కువ ఉత్పత్తి సాధించలేక పోయాము. సగానికి పైగా కార్మిక శక్తి వ్యవసాయంపై ఆధారపడినప్పటికి జి.డి.పి.లో 15శాతం మాత్రమే పెరుగుదల వున్నది. రెండవ వైఫల్యం మానవ వనరుల వినియోగంలో మరింతగా వెనుకబడి వున్నది. పేదరికం, ఆహార భద్రత లేక పోవడం, కనీస గృహావసరాలు కల్పించకపోవడం ఆరోగ్య రక్షణ,శానిటేషన్ లేకపోవడం, విద్య అందరికీ అందుబాటులో లేదు. దీనికి తోడు ప్రాంతీయ అసమానతలు, ఆర్థిక అసమానతలు, సరైన కాంపన్‌సేషన్ లేకుండానే ఉద్యోగులను తొలగించడం జరుగుతున్నది.

ఒక ప్రధాన కారణం అభివృద్ధి చెందిన మేరకు ఉద్యోగాలు పెరగలేదు. దీనితో ఉపాధి రహిత అభివృద్ధిగా ఒక్కమాటలో చెప్పవచ్చును. దీని ప్రభావం వలన మహిళా కార్మికుల జీవితాలలో ఎక్కువగా కనిపిస్తున్నది.

మహిళా కార్మికుల వేతనాలు ఇచ్చిన సందర్భాలు, ఇవ్వని వారు అన్నది లెక్కలేయడం కూడా కష్టమైన పనే. ఎక్కువ ఆర్థిక కార్యకలాపాలలో మహిళా కార్మికుల పనిని గుర్తించడం గాని, సరైన వేతనం చెల్లించడంగాని జరగటంలేదు. అనేక సందర్భాలలో మహిళలే వారియొక్క పనిని, శ్రమని వారే గుర్తించడంలేదు. ఎక్కువ మొత్తంలో మహిళలకు జీతాలు ఇవ్వటంలేదు. అందువలన సమాజం కూడా వారి సేవలను గుర్తించటం లేదు. మహిళని గుర్తించని సమాజంలో మహిళా పనిని కూడా ఆర్థిక పురోగతికి తోడ్పడుతుందనే ఆలోచన కూడా కల్గించటంలేదు. కుటుంబంలో మహిళా పనిని గుర్తించకపోవడంవలన, మహిళా కార్మికుల శ్రమని అంచనా వేయడం కూడా కష్టంగానే వుంటున్నది. దీనివలన మహిళాకార్మికుల గురించి వేసిన లెక్కలు తప్పుడివిగా తేలుతున్నాయి. కొంతమేరకు లెక్కలు సరిగ్గా చూపించడానికి ప్రయత్నాలు జరుగుతున్నా, మహిళా పనిని ఇంకా పూర్తిగా అవగాహన చేసుకోవటం లేదు. ముఖ్యంగా ఇంటిపని కొరకు వారు చేసే శ్రమలో కట్టెలు కొరకు, నీటి కొరకు ఎక్కువ శ్రమ పడుతున్నారు. అనేక గంటలు శ్రమకోడ్చి ఈ రెంటిని సమకూరుస్తున్నారు. ఈ పనిని లెక్కలలోకి తీసుకోవడంలేదు.

ప్రభుత్వ విధానాలు కూడా మహిళా కార్మికులకి కష్టాలు పెంచేవిగానే వుంటున్నాయి. ఉదా :- గ్రామాలలో జాయింట్ ఫారెస్ట్ మేనేజ్‌మెంట్ కమిటీలు వీటి అజమాయిషీ వలన కట్టెలు కొరకు మహిళలు అడవుల లోపల భాగానికి వెళ్ళి రావల్సి వస్తున్నది. ఈ మధ్యకాలంలో మహిళాకార్మికులు పనివిధానంలో కొన్ని మార్పులు చోటుచేసుకున్నాయి. పట్టణాలలో ఇంటిపనివారుగా, అతి తక్కువ వేతనానికి పనిచేస్తున్నారు. కొందరు వస్తు తయారీ పరిశ్రమలలో తక్కువ జీతాలకి పనిచేస్తున్నారు. కొందరు అవుట్ సోర్సింగ్ పనులు చేస్తున్నారు. కొందరు ఇంటి నుంచే పనిచేస్తున్నారు. అందరికి జీతాలు చాలా తక్కువగానే ఇస్తున్నారు. స్పెషల్ జోన్‌లలో కూడా మహిళలకి తక్కువ వేతనాలు ఇస్తున్నారు. గ్రామాలలో ఎక్కువగా స్వయం ఉపాధి పథకాలలోనే మహిళలు పనిచేస్తున్నారు.

కార్మిక చట్టాలు వున్నప్పటికీ ఈ చట్టాలు మహిళా కార్మికులకు వర్తింపచేయడం లేదు. ఈ మధ్యనే వచ్చిన అన్ ఆర్గనైజ్‌డ్ సోషల్ సెక్యూరిటీ ఏక్ట్ 2008 లో మహిళా కార్మికులని కూడా కలిపారు. కొన్ని రాష్ట్రాలు కనీస వేతనాల గురించి నోటిఫికేషన్స్ ఇచ్చాయి. 1999సం॥లో తమిళనాడు ప్రభుత్వం ఇంటి పనిని కూడా తమిళనాడు మున్యువల్ లేబర్ ఏక్ట్ 1982 షెడ్యూల్ లో కలిపారు. తమిళనాడు ఇంటిపనివారల వెల్ఫేర్ బోర్డు అనేక అసోసియేషన్ల పోరాటం తరువాత ఏర్పాటు చేశారు. ఇతర రాష్ట్రాలు కర్ణాటక,కేరళ, రాజస్థాన్ కూడా

**మహిళలకు సామాజికంగా గుర్తింపు, మెరుగైన వేతనాలు, పురుషాధిక్యత పీడన నుండి విముక్తి కలగాలంటే బలమైన పోరాటాలే మార్గం. భారతదేశ చరిత్ర, ప్రపంచ చరిత్ర చూసినా పోరాటాలు జరగకుండా, కార్మికులు ఐక్యం కాకుండా ఏ విజయాలు సాధించలేదు. అనుకూలమైన కార్మికచట్టం రావాలన్నా వాటి అమలు సక్రమంగా జరగాలన్నా పోరాటాలు తప్పనిసరి అని చరిత్ర చెప్తున్నది.**

ఇంటిపనివారికి కనీసవేతనాల కొరకు చట్టం చేశారు గాని ఆచరణలో ఇంకా అమలులోకి రాలేదు. ఐ.ఎల్.ఓ.2010 లో పాస్ చేసిన చట్టాన్ని భారత ప్రభుత్వం ఇంకా అమలు చేయలేదు. ఆమోదించలేదు. ఆమోదించటం అన్నది ఒక ముఖ్యమైన భాగం. దీనివలన కార్మికులు యొక్క హుందాతనం పెరుగుతుంది.

**ముగింపు :-** పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థలో భారతదేశం లాంటి మిశ్రమ ఆర్థిక వ్యవస్థ వున్న చోట మహిళా కార్మికుల పని, స్థితిగతులను అంచనావేయడం చాలా కష్టమైన పని. అదనపు విలువ సంపాదించుటకే పెట్టుబడిదారులకి, కార్మికుల స్థితిగతులు మెరుగుపర్చాలనే ఆలోచన రాదు. ఆర్థిక అసమానతలు, సాంఘిక అసమానతలు, ప్రాంతీయ అసమానతల ఇంకా పెంచుతూనే వుంటారు. దీనివలన కార్మికులకు మెరుగైన వేతనాలు ఇవ్వరు. దీనికి తోడుగా మహిళలు పురుషాధిక్యతని కూడా ఎదుర్కోవలసి వస్తున్నది.

ఈ సమస్యలన్నింటికి పరిష్కారం ఈ పెట్టుబడిదారీ సమాజంలో దొరకదు. మహిళలకు సామాజికంగా గుర్తింపు, మెరుగైన వేతనాలు, పురుషాధిక్యత పీడన నుండి విముక్తి కలగాలంటే బలమైన పోరాటాలే మార్గం. భారతదేశ చరిత్ర, ప్రపంచ చరిత్ర చూసినా పోరాటాలు జరగకుండా, కార్మికులు ఐక్యం కాకుండా ఏ విజయాలు సాధించలేదు. అనుకూలమైన కార్మికచట్టం రావాలన్నా వాటి అమలు సక్రమంగా జరగాలన్నా పోరాటాలు తప్పనిసరి అని చరిత్ర చెప్తున్నది. ఈ కాలంలో పోరాటాలు అనేక రూపాల్లో జరుగుతున్నాయి. వీటి ఫలితంగా స్త్రీ కార్మికులని గౌరవించే మెరుగైన సమాజం తప్పక వస్తుంది అనే ఆశ కనిపిస్తున్నది.

**(స్వేచ్ఛానువాదం పద్మజ)**

అవగాహన సందర్భం

# పరువంటే....

- శిలాలోలిత

చాన్నాళ్ళుగా నన్ను వెంటాడుతున్న ప్రశ్నే ఇది. ఏమిటి? పరువంటే ఏమిటి? అని. నిన్న 'దీప్తి' జీవితాన్ని చూసిన తర్వాత ఆ ప్రశ్న మళ్ళీ రేగింది. చక్కగా చదువుకుని ఉద్యోగం చేస్తూ, తను ఇష్టపడిన అతన్ని పెళ్ళి చేసుకుందామనుకుంది. అతడు కూడా తల్లిదండ్రులను ఒప్పించి బాహాటంగానే పెళ్ళిచేసుకుందామని ఈ పెద్దలకోసం మూడేళ్ళు ఆగారు. ఆ పిల్లల మంచితనం, తల్లిదండ్రులకిచ్చిన గౌరవం తెలీయడం లేదూ!

అతడు విదేశాలకు వెళ్ళిన తర్వాత 'దీప్తి'కి సంబంధాలు చూసి పెళ్ళి చేయడానికి సిద్ధమయ్యారు. అది తెల్సిన దీప్తి అతనికీ విషయం చెప్తే ఇండియాకొచ్చి 'ఆర్యసమాజం'లో పెళ్ళిచేసుకున్నారు. వాళ్ళు అలా వెళ్ళిపోయినా సరిపోయేది. కానీ అమ్మనాన్నల 'ఆశీర్వచనం' (?) కావాలనుకుని ఫోన్ చేసి చెప్పారు.

ఇక్కడివరకూ మామూలు కథే, జీవితమే. కానీ దీప్తి తల్లిదండ్రులు ఎంత క్రూరమైన వాళ్ళో తెలుసా? కూతురు మరో కులం వాడిని పెళ్లి చేసుకుంటే పరువుపోతుందని ఆగ్రహోద్రగులయ్యారు. ఇంటిదగ్గర మొక్కు ఉంది రండని ఇద్దర్నీ నమ్మించి, అతగాడిని హోటల్‌లో దింపి కూతుర్ని ఒక్కతినే వెంటబెట్టుకువెళ్ళారు. 20ని॥ల తర్వాత ఫోన్ చేస్తుంటే, దీప్తి ఎత్తకపోయేసరికి, అనుమానం వచ్చి స్నేహితుల్ని తీసుకుని వెళ్తే, ఇంటికితాళం. లోపల దీప్తిని ఉరివేసి చంపి పరారైన తల్లిదండ్రులు. ఇదంతా నిజమని నమ్మడానికి మనస్సు అంగీకరించడంలేదు. తమచేతుల్లో ఇన్నాళ్ళు అపురూపంగా పెంచుకున్న వాళ్ళు ఎంత దుర్మార్గంగా చంపగలిగారు? విదేశాల్లో ఎవర్నీ ఎవరూ పట్టించుకోరు. ఇక్కడుంటే మీకు పరువు తక్కువ అనుకుంటే మమ్మల్ని వెళ్ళిపోనివ్వండి. మా బతుకు వేం బతుకుతాం. అని గతంలో వాళ్ళు ప్రాధేయపడినా కరుణ కలగలేదు వాళ్ళకు.

ఏమిటిదంతా? అహంకారం, కులహంకారం, డబ్బుమదం, తమమాటలే పిల్లలు వినాలనుకునే మూర్ఖత్వం. పిల్లల్ని వాళ్ళు వస్తువులుగానే చుశారు. స్టేటస్ సింబల్స్‌గానే చూశారు. నలుగురిలో తమ గొప్పతనాన్ని చాటుకునే తోలుబొమ్మలుగానే చూశారు. వేరే కులం వాడిని చేసుకుంటే పరువుపోతుందనుకున్నారే? మరి ఆ పరువు ఇప్పుడేమయింది? కన్నకూతుర్ని చంపిన వ్యక్తులుగా సమాజంలో గుర్తింప బడలేదా? హంతకులు కాలేదా? అంత కక్షలెందుకు? అసలు కులమంటే ఏమిటీ? అది ఎందుకు గొప్పదైంది? కనీసం మానవత్వాన్ని కూడా మర్చిపోయేంత స్థితి ఎందుకు వచ్చింది?

**ఏమిటిదంతా? అహంకారం, కులహంకారం, డబ్బుమదం, తమమాటలే పిల్లలు వినాలనుకునే మూర్ఖత్వం. పిల్లల్ని వాళ్ళు వస్తువులుగానే చుశారు. స్టేటస్ సింబల్స్‌గానే చూశారు. నలుగురిలో తమ గొప్పతనాన్ని చాటుకునే తోలుబొమ్మలుగానే చూశారు. వేరే కులం వాడిని చేసుకుంటే పరువుపోతుందనుకున్నారే? మరి ఆ పరువు ఇప్పుడేమయింది? కన్నకూతుర్ని చంపిన వ్యక్తులుగా సమాజంలో గుర్తింప బడలేదా? హంతకులు కాలేదా? అంత కక్షలెందుకు? అసలు కులమంటే ఏమిటీ? అది ఎందుకు గొప్పదైంది? కనీసం మానవత్వాన్ని కూడా మర్చిపోయేంత స్థితి ఎందుకు వచ్చింది?**

ప్రేమ నేరం కాదే! మెచ్యూరిటీవచ్చి, చదువుసంధ్యలు పూర్తయ్యి, ఉద్యోగాలు చేస్తూ, తమకు నచ్చిన వ్యక్తులను ఇష్టపడి పెళ్ళి చేసుకుంటామనడం నేరంకాదే! పెరిగిన పిల్లల్ని ఇంకా పసిపిల్లలుగా, లోకజ్ఞానం తెలియనివారుగా భావించి, ఎవరు మంచి పిల్లవాడో మాకే తెలును అన్న అహంకారంలోంచి వచ్చింది ఈ నేరం. ఒకవేళ ఆ అమ్మాయి సరైన నిర్ణయం తీసుకోక పెళ్ళిచేసుకున్న తర్వాత అభిప్రాయ భేదాలు వచ్చి విడిపోయినా, మళ్ళీ జీవితం ఉందికదా! స్వయం నిర్ణయాలలో తప్పొప్పులను వారు భరించగలరు. ఈ తల్లిదండ్రుల దాష్టీకాలెన్నాళ్ళింకా? 'దీప్తి' ఎంత నమ్మింది? గొర్రె కసాయివాడిని నమ్మినట్టు. అసలు అమ్మానాన్నలే చంపగలరని ఎవరమన్న ఊహించగలమా? నాకు విన్నదగ్గర్నించీ చాలా బాధనిపించింది. పరువంటే ప్రాణాలు తియ్యడమేనా? సమాజం అంటే నువ్వు, నేను మన చుట్టూ ఉన్న మనుషులే కదా? పరువంటే మన చుట్టూ తిరిగే విషయమేకదా? ప్రాణాలు తీసే స్థితిని తెచ్చుకున్నాక వాళ్ళు ఇన్నాళ్ళు ఉందనుకున్న పరువెక్కడుంది? మేము కన్నపిల్లల్ని తప్పుచేస్తే చంపుకునే హక్కుకూడా ఉందనుకోవడం ఎంతవరకు సమంజసం? ప్రాణాల్ని పోయలేని మనకు తీసే హక్కెక్కడిది? లేదు లేదనుకుంటున్న ఈ కులరక్కసి పోయేదింకెన్నాళ్ళకు? ★

చట్టాలు

# హిందూ దత్తత మరియు మనోవర్తి చట్టం 1956

-దుర్గాప్రసన్న

పూర్వకాలంలో కుటుంబం అంటే భార్య, భర్త, పిల్లలు అని మాత్రమే కాకుండా భార్య పిల్లలు, తల్లిదండ్రులు, అతని యొక్క సోదరులు, తండ్రి సోదరుని పిల్లలు... ఇలా ఆ వంశపరివారమంతా కలిసి ఒక కుటుంబంగా వ్యవహరించేవారు. ఆ కుటుంబం యొక్క బాగోగులు, ఆర్థిక అవసరాలు అన్నీ పర్యవేక్షణ, అజమాయిషీ కుటుంబ పెద్దగా ఒక పురుషుడు చూసేవాడు. ఆడపిల్లలు పెళ్ళైన తర్వాత అత్త వారిళ్ళకు వెళ్ళినప్పటికీ వారి యొక్క రాకపోకలు. పెట్టుపోతలు కూడా కుటుంబ యజమాని అజమాయిషీ చేస్తాడు. వ్యవసాయం ప్రధాన వృత్తిగా జీవించేవారు. మొత్తం మీదా ఇంటా బయటా పురుషునిదే పైచేయి. నిర్ణయాధికారం స్త్రీలకు అధికారాలు నామమాత్రం . కొన్ని సందర్భాలలో, అవసరాన్ని బట్టీ స్త్రీ నిర్ణయాదికారాన్ని కలిగివుండడం. కుటుంబ బాధ్యతని స్వీకరించడం చేసినప్పటికీ అది తప్పనిసరి అయి కుటుంబంలో పురుషుడు లేనందువల్ల ఆమె బాధ్యతను తీసుకోవడం జరిగేది. అంటే కుటుంబాన్ని నడిపించేది. తదనంతరం మతపరమైన కర్మలను ఆచరించేది పురుషుడే. అందువల్ల పురుష సంతానం లేకపోతే ఆ భర్త పురుష సంతానం కోసం ఎన్ని పెళ్ళిళ్ళయినా చేసుకొనేవాడు. లేదా దత్తత అంటే తన వంశానికి చెందిన లేదా ఇతర కుటుంబంలో జన్మించిన అబ్బాయిని దత్తత స్వీకరించి ఆ అబ్బాయికి ఈ కుటుంబంలో ఆస్తి పాస్తుల పై హక్కులనూ, కుటుంబ బాధ్యతలనూ. మతపరమైన కార్యక్రమ నిర్వహణ చేపట్టే అధికారాలను అప్పగించేవారు. అయితే ఈ విధమైన దత్తతను స్వీకరించే అధికారం స్త్రీలకి ఉండేదికాదు. 1857నాటికి కూడా ఇదే పరిస్థితి ఉండేదని మనకందరికీ తెలుసు. ఝాన్సీరాణి అయిన లక్ష్మీభాయి తన భర్త మరణానంతరం ఒక పిల్లవాడ్ని దత్తత తీసుకుంటే నాటి ఆంగ్లేయులు స్త్రీ అయిన ఆమెకు దత్తత తీసుకునే అధికారం లేదని ఆ రాజ్యాన్ని తమ హస్తగతం చేయాలనడం, ఆమె తిరుగుబాటు చేసి ప్రాణాలను కోల్పోవడం మనకు తెలుసు. తదుపరి కాలంలో (1956)లో వచ్చిన హిందు దత్తత మరియు మనోవర్తి చట్టంలో పిల్లలు లేనివారు పిల్లలను వారి యొక్క సొంతపిల్లలుగా పెంచుకునే హక్కును కల్పించింది. అంతేకాదు హిందుస్త్రీ కూడా ఆడపిల్లనుగానీ, మగపిల్లవాడ్నిగానీ దత్తత చేసుకునే హక్కును కల్పించింది. అంటే 1956లో వచ్చిన ఈ చట్టం ద్వారా స్త్రీలకు దత్తత స్వీకరించే హక్కునేకాక, ఆడపిల్లలను దత్తత చేసుకునే హక్కును కూడా కల్పించింది. 1956కి పూర్వం స్త్రీకి దత్తత తీసుకునే అధికారం లేదు. పురుషునికి మాత్రమే ఉండేది .స్త్రీలు తమంత తాముగా కాకుండా భర్త అనుమతితో, భర్తతో పాటుగా దత్తత స్వీకరణ చేసుకొనే వీలు ఉండేది. అసలు దత్తత అనేది పూర్తిగా మతపరంగా జరిగే ఒకతంతు. అంటే ఒక వ్యక్తి మరణానంతరం అతడికి అపర కర్మలు చేయడానికి, పుత్రుడులేని వ్యక్తి పున్నామ నరకం పొందకుండా ఉండేందుకు దత్తత హోమంద్వారా దత్తత చేసుకునేవారు.

● 1956లో వచ్చిన ఈ చట్టం ప్రకారం ఆడపిల్లలనుగానీ, మగపిల్ల వానిని గానీ వారు అక్రమ సంతానమైన, సక్రమసంతానమైన, వారు అనాధనైనా దత్తత చేసుకునే అవకాశం స్త్రీ పురుషులు ఇరువురికి సమానం.

● ఇంటికి అందాన్ని, ఆహ్లాదాన్ని పంచే పసిపిల్లలను అవివాహిత స్త్రీ పురుషులు కూడా దత్తత స్వీకరించడానికి అర్హులే. ఈ చట్టం ప్రకారం వివాహితులై ఉండి విడాకులు తీసుకున్నవారు, వితంతువులు, భర్త నన్యసించిన, వదలివేయబడ్డ స్త్రీలు, భార్య భర్తలలో ఒకరు హిందూ ఏతరులు (ఒకరు మాత్రమే హిందూ) అయినా కూడా సెక్షన్ 8 ప్రకారం దత్తత స్వీకరించవచ్చును.

● **సెక్షన్ 9 :** దత్తత ఇవ్వడానికి కన్న తల్లిదండ్రులు తప్ప ఇతరులకు పిల్లలను దత్తత ఇచ్చే అధికారం లేదు. ఆడపిల్లనైనా, మగపిల్లవాడినైనా దత్తత చేసుకొవచ్చు. కానీ ఆడపిల్లలు 14సం॥లోపు వయసు వారై ఉండాలి. దత్తత చేసుకొనే పిల్లలకంటే దత్తత స్వీకరించే పిల్లల తల్లిదండ్రులు 21సం॥ల వయస్సులో పెద్దవారై ఉండాలి. ఒకసారి దత్తత చేయబడిన పిల్లలు రెండవసారి దత్తత స్వీకరణకి అనర్హులు.

● కన్న తల్లిదండ్రులులేని పిల్లలను కూడా దత్తత చేసుకోవడానికి చట్టంద్వారా అవకాశం కల్పించబడింది. అటువంటి పిల్లలను వారి సంరక్షకులు దత్తత ఇవ్వవచ్చును. అయితే భద్రత కోసం వారు సంబంధిత న్యాయస్థానం నుండి అనుమతి పొందవలసి ఉంటుంది.

దత్తత వారి వారి ఆచారాల ప్రకారం స్వీకరించినా చట్టబద్ధం చేయడం అవసరం. దత్తత కాబడిన పిల్లలకు కన్నపిల్లలకు వుండే అన్ని హక్కులు చట్టబద్ధంగా ఉంటాయి. బాధ్యతలు కూడా దత్తత తల్లిదండ్రుల పట్ల వీరు స్వీకరించాలి. అంటే హక్కులు, బాధ్యతలు సమానంగా ఉంటాయి. దత్తత రద్దు చేసుకునే వీలులేదు.

దత్తతకు సంబంధించిన ఎటువంటి ఆర్థిక లావాదేవీలు జరపరాదు. కేవలం పిల్లలయొక్క భద్రత కొరకు మాత్రమే 'దత్తత'

**తరువాయి 43వ పేజీలో**

కేస్‌స్టడీ

# మాకు న్యాయం కావాలి

-శాంతిశ్రీ

'చిన్నకుటుంబం చింతలేని కుటుంబం' అన్నట్లు ఒక్క కూతురు చాలు అనుకున్నారా దంపతులు. ఆ బిడ్డను పెంచి పెద్దచేసి, పెళ్లి చేశారు. తీరా అల్లుడు కట్నం డబ్బుల కోసమే చేసుకున్నాడనీ, పెళ్లికి ముందే ఒక అమ్మాయితో సంబంధం ఉందని తెలిసి వాళ్ల గుండెలు రోదించాయి. పెళ్లయిన తర్వాత ముందు సంబంధం ఉన్న అమ్మాయితోనే సంసారం చేస్తూ, పిల్లల్ని కన్నాడు. ఇదేమి అన్యాయమని ఊరి పెద్దల్ని కలిసిన తల్లితండ్రులు పంచాయితీ పెట్టారు. పంచాయితీలో తప్పు ఒప్పుకుని కట్నం డబ్బులు ఇచ్చేస్తానన్నాడు. అవేవి ఇవ్వకపోగ తల్లిని ఊళ్లోనే వదిలి, అడ్రస్సు లేకుండా ఆ అమ్మాయిని, పిల్లల్ని తీసుకుని వెళ్లిపోయాడు. పెళ్లి చేసుకున్న అమ్మాయి తల్లితండ్రులు కోర్టుకు వెళ్లారు. అక్కడా వీరికి న్యాయం జరగలేదు. చివరకు ఆ అమ్మాయి జీవితం ఏమైంది? అది తెలుసుకోవాలంటే ఈ 'కేస్ స్టడీ' చదవండి.

భార్యా భర్తలిద్దరూ తమ బిడ్డను వెంటబెట్టుకుని ఐద్వా లీగల్ సెల్‌కు వచ్చారు. వస్తూనే తమ కూతురికి జరిగిన అన్యాయాన్ని తల్లి ఇలా చెప్పుకొచ్చింది. "మా అమ్మాయి పేరు వెన్నెల. మేము పెద్దగా చదువుకోలేదమ్మా! చాలా పేదవాళ్లం. అమ్మాయి అయినా అబ్బాయి అయినా ఒక్కళ్లు చాలు అనుకున్నాం. అమ్మాయే పుట్టింది. దాన్ని ఎంతో ప్రేమగా పెంచుకున్నాం. ఇంటర్ వరకూ చదివించి పెళ్లి చేశాం. ఆ అబ్బాయి కూడా తల్లితండ్రులకు ఒక్కడే కొడుకు అని, పిల్లను బాగా చూసుకుంటాడనుకున్నాం. తీరా పిల్ల కాపురానికి వెళ్లేసరికి ఇంటి పక్కనోళ్లు అబ్బాయి గురించి నాలుగు రకాలుగా చెప్పడం మొదలు పెట్టారు. మా అమ్మాయి బెంబేలెత్తిపోయి మాకు ఫోన్ చేసింది. అవన్నీ పట్టించు కోకు బిడ్డా అబ్బాయి నీతో మంచిగా ఉంటున్నాడు కదా! నువ్వేమీ ఇవన్నీ అబ్బాయిని అడగబోకు' అన్నాం అంతేనంటారా? సరేలే!' అంది మా అమ్మాయి" అని చెప్తుండగా...

బాధ్యులు "మీ అమ్మాయిని చెప్పనివ్వండి అసలు సమస్యను ఎదుర్కొంది ఆమె కదా!" అన్నారు.

వెన్నెల ఇలా చెప్పుకొచ్చింది... "మా అమ్మానాన్న అలా చెప్పారు కదా అని నేనేమీ మాట్లాడలే. అయితే ఒకరోజు నేను కూరగాయలు కొనడానికని సంతకు వెళ్లి వస్తోంటే మా ఆయన ఒకళ్లింట్లో నుండి బయటకు వస్తున్నాడు. నేను ముందు ఆయనా కాదా? అని కొంచెం జాగ్రత్తగానే పరిశీలించా. ఆయనే, ఆ రోజు రాత్రి పనిమీద ఊరెళుతున్నానని, వారం పదిరోజులు పట్టవచ్చని చెప్పినోడు ఊళ్లోనే ఉన్నాడేంటి? ఈఇల్లు ఎవరిది? అని మదనపడుతూ అసలు విషయమేంటో కనుక్కుందామని మా ఆయన కొంచె దూరం వెళ్లే వరకూ ఆగి, ఆ ఇంటికి వెళ్లా, ఆ ఇంట్లో ఒకామె ఆరోనెలో, ఐదోనెలో కడుపుతో ఉంది. కొంచెం మంచినీళ్లు ఇమ్మని అడిగి, ఇల్లంతా పరిశీలిస్తే వాళ్లిద్దరూ కలిసి దిగిన పెళ్లి ఫోటోలు గోడకు ఉన్నాయి. 'ఆయన ఎవరు? అని ఆమెను అడిగా 'మా ఆయన' అని బదులిచ్చింది. నేను షాక్ అయిపోయా. అయినా తేరుకుని, మీకు పెళ్లెప్పుడు అయ్యిందని అడిగా 'ఏడాది అయ్యింది తొలి కడుపు ఇప్పుడు ఆరోనెల నడుస్తోంది!' అని చెప్పింది. నా కాళ్లు భూమిలోకి కుంగిపోతున్నట్లు అన్పించింది. అక్కడే ఆయన వచ్చే వరకూ ఉందామనుకున్నా కానీ ఆ అమ్మాయి ఏమనుకుంటుందో అని ఇంటికి వెళ్లిపోయా! కొంచెం చీకటి పడుతుండగా వాళ్లింటికి వెళ్లా తలుపు కొట్టగానే అతడే వచ్చి తీశాడు. నన్ను చూడగానే తలుపు దడేల్‌మని వేసేశాడు. నేను నా బలమంతా ఉపయోగించి నెట్టా. నేనలా చేస్తానని ఊహించినట్లు లేదు, తలుపులు తెరుచుకోవటం, ఆయన వెనక్కి పడిపోవడం వెంట వెంటనే జరిగిపోయాయి. 'ఇంతకుముందే పెళ్లి చేసుకున్నోడివి నన్నెందుకు చేసుకున్నావ్?' అని అడిగా 'కట్నం డబ్బులు కోసం చేసుకున్నా!' అన్నాడు. నేను నీకు ఎట్లా కన్పిస్తున్నా? నా జీవితాన్ని అంతా నాశనం చేశావు? అని వాడిని చెప్పు తీసుకుని, ఈ చెంపా ఆ చెంపా వాయించా. మా అమ్మానాన్నని రమ్మంటాను నీ సంగతి ఏమిటో వాళ్లే

"మా అమ్మాయి పేరు వెన్నెల. మేము పెద్దగా చదువుకోలేదమ్మా! చాలా పేదవాళ్లం. అమ్మాయి అయినా అబ్బాయి అయినా ఒక్కళ్లు చాలు అనుకున్నాం. అమ్మాయే పుట్టింది. దాన్ని ఎంతో ప్రేమగా పెంచుకున్నాం. ఇంటర్ వరకూ చదివించి పెళ్లి చేశాం. ఆ అబ్బాయి కూడా తల్లితండ్రులకు ఒక్కడే కొడుకు అని, పిల్లను బాగా చూసుకుంటాడనుకున్నాం. తీరా పిల్ల కాపురానికి వెళ్లేసరికి ఇంటి పక్కనోళ్లు అబ్బాయి గురించి నాలుగు రకాలుగా చెప్పడం మొదలు పెట్టారు. మా అమ్మాయి బెంబేలెత్తిపోయి మాకు ఫోన్ చేసింది. అవన్నీ పట్టించు కోకు బిడ్డా అబ్బాయి నీతో మంచిగా ఉంటున్నాడు కదా! నువ్వేమీ ఇవన్నీ అబ్బాయిని అడగబోకు' అన్నాం

కనుక్కుంటారు' అని అక్కడ నుండి ఇంటికి వచ్చేసి, మా వాళ్లకి ఫోను చేసి విషయమంతా చెప్పా. తెల్లారేటప్పటికి మా వాళ్లు వచ్చారు. ఊళ్లో పెద్దమనుషుల్ని కలిశారు. పంచాయితీ చేశారు. అక్కడ 'తప్పే అని, ఆ అమ్మాయిని వదిలిపెట్టనని, ఈ అమ్మాయినీ చూసుకుంటాను' అని మా ఆయన అన్నాడు. 'నేను అలా ఉండను' అని చెప్పాను. దీంతో కట్నం డబ్బులు, ఖర్చుల కింద అయినవన్నీ లెక్కగట్టి ఐదు లక్షలు తిరిగి ఇచ్చేందుకు ఒప్పుకున్నాడు.రెండు నెలల సమయం అడిగాడు. మావాళ్లు సరేనని కాగితాలు రాయించుకుని, అతనితో ఊరి పెద్దలతో సంతకాలు చేయించుకున్నారు. నన్ను తీసుకుని వెళ్లిపోయారు. మూడు నెలలు అయినా అతను డబ్బులు ఇవ్వకపోవడంతో మళ్లీ వెళ్లి ఊరి సర్పంచ్‌ని అడిగారు. ఆయన పిలిపించి మాట్లాడితే నేను ఇవ్వను, ఏమి చేసుకుంటారో చేసుకోండి!' అన్నాడు. దీంతో కొందరు పెద్ద మనుషుల సలహాతో మా అమ్మానాన్న పోలీస్ కేసు పెట్టారు. కోర్టులో కేసు నడుస్తోంది. అయితే వారం క్రితమే వాయిదా ఉండాలి. కానీ లాయర్ ఏమీ పంపలేదు. దీంతో మేమే కోర్టుకు వెళ్లి పబ్లిక్ ప్రాసిక్యూటర్‌ని కలిశాం. ఆయన మా కేసు క్లోజ్ అయిపోయింది అంటున్నాడు. మేము ఎటువంటి అంగీకారానికి రాకుండా, మాకేమి చెప్పకుండా కేసు ఎట్లా క్లోజ్ అవుతుంది?' అని అడిగితే మీరు సంతకం చేశారు అంటున్నారు" అని చెప్పడం ముగించింది.

'మాకు చదువురాదు. లాయర్‌గారు సంతకం పెట్టమన్న చోటల్లా పెట్టాము' అని వెన్నెల తల్లి బోరు బోరుమని ఏడ్చారు.

మొత్తం విన్న బాధ్యులు "బాధపడకమ్మా! అతన్ని పిలిపించి మాట్లాడదాం' అని అతని చిరునామా అడిగారు. అతను ఎక్కడ ఉందీ తెలియదన్నారు. వాళ్లమ్మ మాత్రం ఊళ్లోనే ఉంటుందని చెప్పారు. దీంతో బాధ్యులు ఆమె తల్లికి లేఖ పంపారు.

వరుసగా రెండు వారాలు చూశారు. రాకపోయేసరికి ఆ ఊరి సర్పంచ్‌కి బాధ్యులు ఫోన్ చేశారు. "మేము ఎంత చెప్పినా అతగాడు వినలేదమ్మా! ఈ ముసలిదాన్ని ఊళ్లో వదిలి వెళ్లిపోయాడు. మీ లెటరు అందింది మీరు ఏమి చర్య తీసుకున్నా మేము కూడా మీ వైపే!' అన్నారు. ఊరికి అస్సలు రావడం లేదా?' అని అడిగితే ఎప్పుడన్నా వస్తాడని చెప్పారు. వచ్చినప్పుడు మేము లెటర్ పంపామనీ, మీకు ఫోన్ చేశామని చెప్పండి అన్నారు. కానీ మరో మూడు వారాలు గడిచినా అతని వైపు నుండి సమాధానం లేదు. 'మాకు న్యాయం జరిగితే చాలమ్మా! మేము ఇంతగా మోసపోతామనుకోలేదమ్మా!' అని వెన్నెల తల్లి బాధ్యుల్ని పట్టుకుని పెద్దగా ఏడ్చేశారు. బాధ్యులు ఆమెను ఓదార్చారు. వెన్నెల ఇప్పుడు ప్రయివేటు జాబ్ చేస్తూ డిగ్రీ చదువుతోంది. ధైర్యంగా ఉండమని బాధ్యులు వెన్నెలకు చెప్పారు. 'నా జీవితం నేర్పిన పాఠంతో నాకు చాలా ధైర్యం వచ్చింది!' అంది వెన్నెల చివరకు కేసును రాష్ట్ర మహిళా కమీషన్‌కు పంపారు. ప్రస్తుతం, మహిళా కమీషన్ కేసును పర్యవేక్షిస్తున్నారు. అమ్మాయికి కట్నం డబ్బు వెనక్కి ఇప్పించడంలో, భార్య వుండగా, రెండో పెళ్ళి చేసుకున్న నేరానికి, శ్రీకృష్ణ జన్మ స్థానానికి పంపించడానికి అన్ని చర్యలు తీసుకుంటామని చెప్పారు.

నేటి సమాజంలో, మహిళలు మోసపోతున్న తీరు, తమ కోర్కెలు తీర్చే విధంగా పురుషుడు మహిళలను ఉపయోగించుకోవడం, కట్నం పేరుతో, డబ్బుతీసుకొచ్చే సాధనంగా భార్యను చూడటం లాంటి అనేక అంశాలు పై కేసులో మనకు గోచరిస్తూ మహిళల నేటి స్థితికి అద్దం పడుతున్నది. ●

## జస్టిస్ పి.ఏ. చౌదరి గారికి సంతాపం



ప్రముఖ న్యాయమూర్తి జస్టిస్ పి.ఎ. చౌదరి 17-5-14వ తేదిన కనుమూసారు. చౌదరిగారు రైతు, మరియు మహిళలతోపాటు అనేక తరగతులకు సంబంధించి అభ్యుదయకరమైన తీర్పులు ఇచ్చారు. హిందూ మ్యారేజ్ యాక్టు ప్రకారం వైవాహిక హక్కుల పునరుద్దరణ కోరుతూ సెక్షన్9 ప్రకారం భార్యభర్తల వైవాహిక జీవిత పునరుద్దరణ కోరుతూ, కోర్టుకు వెళ్లే అవకాశముంది. దానిని ఆధారంగా చేసుకొని, వారి వైవాహిక జీవితంలో చాలా సం॥లు దూరంగా వున్నప్పటికి సినీ నటి సరిత భర్త కోర్టులో కేసు వేసాడు. ఆ కేసు విషయంలో చౌదరిగారు ఇది రాజ్యాంగంలోని ఆర్టికల్ 21కి వ్యతిరేకమని చారిత్రాత్మక తీర్పు ఇచ్చారు. ఇష్టంలేని భర్తతో భార్య ఖచ్చితంగా కలిసి జీవించాలని నిర్దేశించడం సరియైనది కాదు. కావున సెక్షన్ 9ని రద్దు చేయాలని సంచలనాత్మక తీర్పు ఇచ్చారు. ఇది మహిళల్లో మనోధైర్యాన్ని పెంచింది. జస్టిస్ చౌదరి సామ్యవాది. సమాజంలో అన్యాయం ఎక్కడున్నా తన తీర్పుల ద్వారా సరిదిద్దడానికి ప్రయత్నించారు. విశాఖపట్నంలో ఓ కార్మికుడు భార్యను వదిలేసి వెళ్ళిపోగా భర్తకు కేటాయించిన క్వార్టర్లో భార్య ఉండసాగింది. కార్మికుడు భార్యను వదిలాడుకాని, ఉద్యోగంలోనే ఉన్నాడు. ఈ సమయంలో క్వార్టర్ ఖాళీ చేయాల్సిందిగా యాజమాన్యం కోర్టుకెళ్ళింది. జస్టిస్ చౌదరి తీర్పులో రాజ్యాంగం రీత్యా మనది సోషలిజం ఆదర్శంగా ఉన్న దేశం కనుక సోషలిజంలో వ్యక్తికీ, వ్యక్తికీ మధ్యన సంబంధాలు పెంపొందాలే తప్ప యజమానికి ఆస్తికి మధ్యకారదు. ఒక ఆడపడుచు, ఆమె సంతానం బజారుపాలు కావటానికి వీల్లేదని మానవత్వంతో తీర్పు చెప్పారు. ఇటువంటి అభ్యుదయకరమైన తీర్పులు ఇచ్చిన పి.ఎ.చౌదరి కనుమూయడం దురదృష్టకరం. ఆయనకు చైతన్య మానవి హృదయ పూర్వక నివాళులర్పిస్తోంది.

మార్చి 8, అంతర్జాతీయ
మహిళా దినోత్సవ
శుభాకాంక్షలు



# శ్రీ పీడిక రాజన్నదొర

మాజీ ఎమ్మెల్యే,
వైఎస్సార్ కాంగ్రెస్ పార్టీ నాయకులు,
సాలూరు, విజయనగరం జిల్లా.

సినిమా




# "హైవే"

-కె. సమత

"హైవే" సినిమా చూసి బయటకు రాగానే చాలా రోజుల తర్వాత ఒక మంచి సినిమా చూసిన తృప్తి కలిగింది. అసభ్యమైన కామెడీ, మితిమీరిన యాక్షన్, హీరో చేసే ఓవర్ యాక్షన్ ప్రతి సినిమాలో రొటీన్ అయిపోయింది. హీరో హీరోయిన్ ఎక్కడో కలవడం, వెంటనే ప్రేమ చిగురించడం, వాళ్ళిద్దరి మధ్య కెమిస్ట్రీ మొదలవుతుంది. ఇక ఎంత కెమిస్ట్రీ చూపిస్తే అంత కలక్షన్. పెళ్ళి, పిల్లలతో శుభం కార్డు. ఇవి చాలు కదా! ఈ రోజుల్లో సినిమా తీయడానికి. ఇవేమీ లేకపోయినా ఆ సినిమాలో ఒక ఐటమ్ సాంగ్ ఉంటే చాలు ఆ సినిమా పాపులర్ అయిపోవడానికి. ఇలాంటి ప్రేమ కథలు మనకి ఏ సందేశాన్ని ఇస్తున్నాయి? ఆలోచించండి. ఉపయోగం ఏమైనా ఉందా? వీటిని ఆదరించే ప్రేక్షకులు కోకొల్లలు. క్రియేటివ్‌గా సినిమాలు తీసి ప్రేక్షకులకి మంచి సందేశాన్ని ఇస్తే వాటిని ఆదరించే ప్రేక్షకులు సరిగ్గా గుప్పెడు మంది ఉంటారు. ఈ మధ్య కాలంలో వచ్చిన లంచ్‌బాక్స్, హైవే సినిమాలు కూడా అంతేనండి. అందరికీ ఇలాంటి సినిమాలు ఎక్కవు. ఇలాంటి సినిమాలను ఆదరించడానికి కావలసింది ఆస్వాదించే సున్నితమైన మనసు.

ఈ మధ్యనే ఇంటర్నెట్‌లో హైవే రివ్యూ చదివాను. రేటింగ్ చూస్తే 7.5/10 అసలు కథే లేని పనికిరాని సినిమాలకి 10/10 రేటింగ్. హైవే సినిమా ప్రేక్షకులను అసంతృప్తికి దారితీసింది అని హెడ్డింగ్ చూడగానే కోపం వచ్చింది. పైగా ఆ రివ్యూ రాసింది ఒక అమ్మాయి. ఏదో కథకి వాస్తవికతను అద్దిన చాలా అసహజమైన సినిమా అన్న ఆమె వ్యాఖ్యల సారాంశం. ఆ రివ్యూకి వచ్చి కామెంట్స్ చేశాక నేను నిజంగా చాలా సంతోషపడ్డాను. ఆ కామెంట్స్ ఇచ్చే వాళ్ళలో తీవ్రమైన కసి. "మతి ఉండే రాశావా ఈ రివ్యూ'' అనే రీతిలో తిట్ల వర్షం కురిపించారు. హైవే లాంటి సినిమాని సరిగ్గా అర్థం కాక ఆదరించకపోయినా పర్లేదు కానీ విమర్శించకండి నలుగురిలో నవ్వుల పాలవుతారు.

చిన్న-పెద్ద, ఆడ-మగ అందరూ చూడాల్సిన సినిమా ఇది. ఆడపిల్లలకు భద్రతలేని పరిస్థితులను, స్వచ్ఛమైన ప్రేమ, స్వేచ్ఛ, అనుబంధం గురించి ఆలోచింపచేస్తుంది "హైవే".

రణదీప్ హుడా, అలియా భట్ నటన, ఎ.ఆర్. రెహమాన్ సంగీతం, అనీల్ మెహతా సినిమాటోగ్రఫీ అన్నీ ఈ సినిమాకు ప్లస్ పాయింట్స్. అన్నిటికన్నా సినిమాటోగ్రఫీ అద్భుతం. దర్శకుడు ...మంచి విషయాన్ని తీసుకుని తెరకెక్కించారు. ప్రస్తుతం సమాజంలో ఉన్న అతి పెద్ద సమస్య... హైవే మీద 6 రాష్ట్రాల్లో ప్రయాణం. మనమే నిజంగా ఆ ప్రాంతాలన్నీ చుట్టి వచ్చినట్టు అనిపిస్తుంది. ముఖ్యంగా రాజస్థాన్, కాశ్మీర్ అందాలు అమోఘం. "పతాక గుడి" పాట అందరి నోట్లో నాని నాని ఎ.ఆర్. రెహమాన్ హిట్ సాంగ్స్‌లో ఒకటి అయింది. రణదీప్, అలియా నటన ప్రేక్షకుల్ని లీనమైపోయి అదొక సినిమా అన్న సంగతే మర్చిపోయేలా చేస్తుంది. మన చుట్టు పక్కల జరిగే కథనంలా అనిపిస్తుంది.

హీరోయిన్ అనబడే వీర బాగా డబ్బు, పలుకుబడి ఉన్న కుటుంబం నుండి కిడ్నాప్‌నకు గురవుతుంది. మహావీర్ అనే వ్యక్తి ఆమెను బంధించి ఆమె కుటుంబం నుండి డబ్బులు రాబట్టడానికి ప్లాన్ వేస్తాడు. అమ్మాయిని ఒక్క దగ్గరే ఉంచడం సేఫ్ కాదని లారీలో ఉంచి హైవే పై తిప్పుతూ ఉంటాడు. కిడ్నాపర్స్‌లో ఒకడు వీరతో అసభ్యంగా ప్రవర్తిస్తే వాడికి వార్నింగ్ ఇచ్చి తనని సేఫ్‌గా ఉండమని చెబుతాడు. వీరకి మహావీర్ దగ్గర భద్రత, స్వేచ్ఛ దొరికినట్లు అనిపిస్తుంది. తనకి కిడ్నాపర్స్ నుండి తప్పించుకునే అవకాశం వచ్చినా తప్పించుకోదు. మహావీర్‌తో ఉండిపోవడానికే ఇష్టపడుతుంది. కిడ్నాప్‌కి గురయినట్లు ఏమాత్రం అనిపించదు వీర ప్రవర్తన. మహావీర్ ఇదంతా చూసి షాక్‌కు గురవుతాడు. 'చెక్‌పోస్ట్ వద్ద నీకు తప్పించుకోవడానికి అవకాశం వస్తే ఎందుకు దాక్కున్నావ్?' అని అడుగుతాడు. ఇంట్లో తనకి స్వేచ్ఛ, భద్రత లేవని తను అనుభవించిన లైంగిక వేధింపుల గురించి చెబుతుంది. కుటుంబ సభ్యులలో ఒకడైన అంకుల్ వీరకి 9ఏళ్ళ వయస్సు ఉన్నప్పటి నుండి తనని ఎలా లైంగికంగా వేధించాడో చెబుతుంది. ఈ విషయం తన తల్లికి చెబితే ఏం చేయకుండా ఈ విషయం ఎవ్వరికీ చెప్పకు ష్...అని ఎలా ఆపేసిందో చెప్పి బాధపడుతుంది. చిన్నప్పటి

**ఈ మధ్యనే ఇంటర్నెట్‌లో హైవే రివ్యూ చదివాను. రేటింగ్ చూస్తే 7.5/10 అసలు కథే లేని పనికిరాని సినిమాలకి 10/10 రేటింగ్. హైవే సినిమా ప్రేక్షకులను అసంతృప్తికి దారితీసింది అని హెడ్డింగ్ చూడగానే కోపం వచ్చింది. పైగా ఆ రివ్యూ రాసింది ఒక అమ్మాయి. ఏదో కథకి వాస్తవికతను అద్దిన చాలా అసహజమైన సినిమా అన్న ఆమె వ్యాఖ్యల సారాంశం. ఆ రివ్యూకి వచ్చి కామెంట్స్ చేశాక నేను నిజంగా చాలా సంతోషపడ్డాను. ఆ కామెంట్స్ ఇచ్చే వాళ్ళలో తీవ్రమైన కసి. "మతి ఉండే రాశావా ఈ రివ్యూ" అనే రీతిలో తిట్ల వర్షం కురిపించారు. హైవే లాంటి సినిమాని సరిగ్గా అర్థం కాక ఆదరించకపోయినా పర్లేదు కానీ విమర్శించకండి నలుగురిలో నవ్వుల పాలవుతారు.**

నుండి అనుభవిస్తున్న ఈ వేధింపుల కారణంగా తను ఇంట్లో ఉన్న దానికన్నా కిడ్నాప్ అయ్యాకే స్వేచ్ఛగా, భద్రంగా ఉన్నానని చెబుతుంది. మహావీర్ ఎలా స్పందించాలో అర్థం కాక మౌనంగా ఉండిపోతాడు.

వీర మహావీర్‌ను తన జీవితం గురించి చెప్పమనీ చాలా సార్లు అడుగుతుంది. మహావీర్ తన జీవన నేపథ్యం, అమ్మతో తనకున్న అనుబంధం, ఉన్నత కులాల వారు మహావీర్‌ని ఎలా హింసించేవాళ్ళో చెబుతాడు. అతను ఒక దొంగగా మారడానికి కారణమైన పరిస్థితులు, చూపించిన కోణం చాలా అరుదుగా కనిపిస్తుంది. వీరని చూసినప్పుడు అమ్మ గుర్తొచ్చి ఏడ్వడం, వీర తనని దగ్గరికి తీసుకొని ఓదార్చడం వాళ్ళిద్దరి మధ్య స్వచ్ఛమైన ప్రేమ కనిపిస్తుంది. 'నా కిడ్నాప్ పని అయ్యాక ఇంటికి వెళ్ళి ఒకసారి అమ్మని కలిసిరమ్మని' సలహా ఇస్తుంది వీర.

వీరని స్వేచ్ఛగా బతకమని ఒక ప్రాంతంలో వదిలేసి వెళ్ళిపోదామని అనుకుంటాడు మహావీర్. వీర తనతోనే ఉండాలనుందని గట్టిగా చెబుతుంది. 'మన ఇద్దరి జీవితాలు వేరే. అసలేంటి నీ ఉద్దేశ్యం' అని గట్టిగా కసురుకుంటాడు. 'నాకు అదంతా తెలియదు. నీతోనే ఉంటాను' అని మహావీర్‌ని ఒప్పిస్తుంది. తన ఇంట్లో దొరకని భద్రత వీరకి మహావీర్ దగ్గర దొరుకుతుంది. వీర కోరిక మేరకు కొండల మధ్య ఒక ఇల్లు ఏర్పాటు చేసుకుని ప్రశాంతంగా జీవించాలనుకుంటారు. ఈ లోపు పోలీసు దాడుల్లో మహావీర్ ప్రాణాలు కోల్పోతాడు.

పోలీసుల ద్వారా ఇంటికి చేరిన వీర కుటుంబ సభ్యులందరి ముందు అంకుల్‌ని నిలదీసి అడుగుతుంది. తనని ఆపబోయిన అమ్మని ఎదిరించి ష్..ష్.. అని నన్ను ఆపొద్దని అంకుల్‌ను నిలదీస్తుంది. 'నాకు స్వేచ్ఛగా ఉండాలనిపిస్తోంది'అని ఇంటి నుండి వచ్చేసి ఒంటరిగా జీవిస్తుంది.

ఎక్కడ చూసినా స్త్రీలపై అత్యాచారాలు, దాడులు. ఆడపిల్ల పుడితే చాలు తల్లిదండ్రుల్లో ఆందోళన. అమ్మాయిల్ని చదువులకి, ఉద్యోగాలకి ఎక్కడికైనా పంపాలన్నా వెనకడుగు వేయాల్సివస్తుంది. కామాంధులు ప్రతిచోటా ఉన్నారు. 2,3 సం॥ల పిల్లల నుండి 60,70 సం॥ల ముసలి వాళ్ళ వరకూ ఎవర్నీ వదలట్లేదు. స్త్రీ భద్రత గురించి ఆలోచిస్తే ఆందోళన కలుగుతోంది. ఎక్కడికీ వెళ్ళకుండా ఇంట్లోనే ఉంటే అమ్మాయి భద్రంగా ఉంటుందా? గ్యారెంటీ ఇవ్వగలరా? ఇంటికి వచ్చే చుట్టాలు, ఇరుగుపొరుగు వాళ్ళు వీరందరిలో ఎవడో ఒక కామాంధుడు ఉంటాడు. ప్రతి అమ్మాయి జీవితంలో ఏదో ఒక సమయంలో ఇలాంటి రాబందుల్ని ఎదుర్కొనే ఉంటుంది. ఇలాంటి చేదు అనుభవాలు లేని అమ్మాయిలు ఉన్నారా? వీటిలో అరుదుగా బయటకు వచ్చే సంఘటనలు, కేసులు కొన్నైతే పరువు పోతుందనే భయంతో బయటికి రానివ్వకుండా కప్పి పుచ్చే కేసులు ఎన్నో. తాతయ్య వయస్సు వాడు ప్రేమగా దగ్గరికి తీసుకున్నా అనుమానించాల్సిన పరిస్థితి వచ్చింది. ఎవర్ని నమ్మాలి? మనకి భద్రత ఎక్కడ? ఎప్పుడు స్వేచ్ఛగా తిరగగలుగుతాం? 'హైవే' సినిమా చూస్తే వీటన్నింటికీ సమాధానం దొరకకపోయినా కనీసం ఆలోచిస్తాం. ఎందుకంటే ఇవన్నీ 'కామన్' అనుకొని దులుపుకొని వెళ్ళిపోవడం తప్ప ఎదిరించాలనే ఆలోచన కరువైపోయింది. ఎప్పుడైతే ఆలోచన వస్తుందో మన సమస్యకి పరిష్కారం దొరుకుతుంది. ●

# అమ్మ

"ఆనందానికి అందం అమ్మ....
ఆత్మీయతకు రూపం అమ్మ".....
"అలరించే ఓ స్నేహం అమ్మ............
అమ్మను మించి ఏమున్నది అమ్మ"....
"అమ్మ..... మా అమ్మ"....

" బుడిబుడి అడుగులు వేయించేను అమ్మ......
తొమ్మిది నెలలు మోసిన అమ్మ"....
"ప్రాణం పోసి పెంచిన అమ్మ ..........
నా కళ్లలో దాగున్నది అమ్మ .....
"కలలో కూడా చేజారకు అమ్మ ......
నిన్ను విడిచి క్షణముండను అమ్మ "
"అమ్మ ..... మా అమ్మ "....

" ఆ దేవుడికైనా దైవం అమ్మ .....
చిన్ననాటి ఓ స్నేహం అమ్మ ".....
" నా కన్నీళ్లే తానయ్యే అమ్మ .........
నీతో నడిచే నీ నీడే అమ్మ .......
అందుకే
" అమ్మను మించి ఏమున్నది అమ్మ ....
అమ్మ....... మా అమ్మ ".......

అమ్మ అనే పదంలోని ఆత్మీయత ఎవరు కొనలేనిది. అలాగే నాన్న అనే పదంలోని ఆప్యాయత మరువలేనిది. ప్రతిక్షణం, ప్రతి నిమిషం నీకోసం, నీ సంతోషం కోసమే ఆలోచిస్తారు. తమ కన్నీటిని నీ ఆనందం కోసం ఖర్చుపెడతారు. వాళ్లే లేకపోతే మనంలేము.

చిన్నప్పుడు గోరుముద్దలు తినిపిస్తూ చందమామ రావే అంటే అది మన దగ్గరికి వస్తుందని నమ్మేసి అమ్మ పెట్టే గోరుముద్దలు తింటూ, నవ్వుతున్నామని అమ్మ అనుకుంటుంది, కానీ నిజం ఎంటంటే? ఆ చందమామలో కనపడుతున్న తన అమ్మ అందమైన రూపం తన పక్కనే ఉందని నమ్ముతాడు.

మొదటిసారి అమ్మ అని పిలిచినప్పుడు తనుపడే ఆనందం గురించి మా అమ్మ ఇప్పటకీ నాతో చెబుతుంటుంది. అందుకే అమ్మ గురించి ఎంత చెప్పిన, ఎంత మాట్లాడినా సరిపోదు. అనంతమైనది అమ్మప్రేమ.

**-తిరుమలేశ్**

**(మార్చి8 అంతర్జాతీయ మహిళా దినోత్సవం సందర్భంగా ఐద్వా అనంతపురం జిల్లా కమిటి ఆధ్వర్యంలో జరిగిన వక్తృత్వ పోటీల్లో బహుమతి పొందిన కవిత)**

శాస్త్రీయం

# (బహిష్టు లేదా రుతుస్రావం)ఆ సమయంలో పచ్చళ్ళను తాకితే అవి పాడైపోతాయా?

- డాక్టర్ రమాదేవి.మీసరగండ



ప్రాచీనకాలంలో స్త్రీ లైంగిక ప్రత్యుత్పత్తి విధానం గురించి అవగాహన లేకపోవడం వల్ల అనేక అపోహలకు, భయాలకు , నిషేధాలకు కారణమైంది. అంటు అవడం, ముట్టు అవడం, మైల, దూరంగా వున్నారనటం, ఇంట్లోకి రాకూడదు లాంటి వ్యతిరేక పదాలు వాడుకలోకి వచ్చాయి. ఈ భావాలు శాస్త్రవిజ్ఞానం, వైద్యవిజ్ఞానం ఇంతగా పెరిగిన ఆధునికయుగంలోనూ ఇంకా వినియోగంలో వున్నాయి. రుతుస్రావానికి సంబంధించిన నమ్మకాలలో చాలా మార్పువచ్చింది. అయినప్పటికీ ఇంకా మూఢనమ్మకాలు బలంగా వున్నాయి. రుతుస్రావం సమయంలో ముట్టుకుంటే పచ్చళ్ళు చెడిపోతాయి, మొక్కలు ఎండిపోతాయి. గుడికి వెళ్ళద్దు, నమాజు చెయ్యొద్దు, పండుగలు, పెళ్ళిళ్ళలకు దూరంగా వుండాలి. ఇలాంటివి సాధారణంగా సమాజంలో అమలులో వున్నాయి. రుతుస్రావం సమయంలో పచ్చళ్ళను, ఇతర నిలువ పదార్థాలను తాకితే అవి పాడైపోతాయన్న నమ్మకం విస్తృతంగా వుండటంతో ఆ సమయంలో వాటిని తాకడానికి ఆడపిల్లలు భయపడిపోతారు.

నిల్వ పచ్చళ్ళలో ఉప్పువంటి దినుసులు పాళ్ళలో తేడా కారణంగా అప్పుడప్పుడు అవి పాడైపోతాయి. అలాగే పచ్చళ్ళను నిల్వ వుండే రసాయనిక పదార్థాలు (ప్రిజర్వేటివ్స్) లోపించిన కారణంగా కూడా అవి పాడైపోతాయి. అంతేకాని తడితగిలినా, సమపాళ్ళలో దినుసులు లేకపోయినా అవి మగవాళ్ళు తాకినా పాడైపోతాయి. అంతేకాని రుతుస్రావం సమయంలో మహిళలు తాకడం వల్ల కాదు. కాబట్టి ఎవరైనా ప్రయోగాత్మకంగా ఆ సమయంలో పచ్చళ్ళను, మొక్కలను తాకి చూడండి. అప్పుడు ఇవన్నీ మూఢనమ్మకాలని అర్థమైపోతుంది.

**బహిష్టు ఆలస్యంగా లేదా ముందు వచ్చేలా చేయడం :-** రుతుస్రావాన్ని అపవిత్రంగా భావించడం వల్ల పెళ్ళిళ్ళు, జాతరలు, తీర్థయాత్రలు, పండగలు లాంటివి వచ్చినప్పుడు ఆ రుతుస్రావ సమయాన్ని మార్చుకోవడం కోసం టాబ్లెట్లు వాడడం అలవాటుగా మారింది. చదువుకుని, ఉద్యోగాలు చేసే మహిళలు సైతం ఇందుకు మినహాయింపు కాదు. ఈ మందులలో హార్మోన్లు వుంటాయి. ఈ టాబ్లెట్లు వాడటం వల్ల హార్మోన్ల ఉత్పత్తి సమతూకం లోపిస్తుంది. సహజ ఉత్పత్తి క్రమాన్ని ఈ టాబ్లెట్లు తల క్రిందులు చేస్తాయి. దానితో దీర్ఘకాలంలో వీటి విషఫలితాలు కనిపిస్తాయి. రుతుస్రావం హెచ్చు తక్కువలు కావడం, కొన్ని రకాల కాన్సర్‌లకు దారితీయడం జరుగుతుంది.

అందుకనే వీటిని వాడటం ఏమాత్రం మంచిది కాదు. రుతుస్రావం చుట్టూ వున్న మూఢనమ్మకాల నుండి బయటపడితేనే స్త్రీలు ఆరోగ్యకరంగా వుండగల్గుతారు.

37వ పేజీ తరువాయి

జరగవలసివుంటుంది. ఒకవేళ ఈ నిబంధనను అతిక్రమించినట్లయితే జరిమానా, జైలుశిక్ష తప్పవు.

(దత్తతని ముస్లింలా గుర్తించలేదు అంటే చట్టబద్ధం కాదు)

ఈ చట్టం ద్వారా హిందూ స్త్రీలు అవివాహితలైనా, వివాహితలైన పిల్లలను చట్టబద్ధంగా దత్తత తీసుకొని పెంచుకోవచ్చును. ఆడపిల్లలను కూడా దత్తత స్వీకరించడానికి ఈ చట్టం అనుమతినిచ్చింది. స్త్రీలు తమంతట తాముగా తమకు నచ్చినట్లుగా జీవించడానికి, నచ్చినట్లుగా పిల్లలను దత్తత తీసుకుని వారిని పెంచి, పోషించే బాధ్యతను నిర్వహించడానికి ఈ చట్టం ఒక హక్కును కల్పించింది. అంతేకాదు ఆడపిల్లలు, మగపిల్లలు అనే తేడా లేకుండా ఎవరినైనా దత్తత ఇవ్వడానికి, పుచ్చుకోవడానికి కూడా ఈ చట్టం వీలు కల్పించింది.

ధోరణి

అమెరికా నుంచి గోపాల్ అన్నయ్య వస్తున్నాడని విని నా కొడుకులిద్దరూ సంతోషంగా ఎగిరి గంతేశారు.

"అమ్మా, ఈ మాటు మామయ్యని సాలార్‌జింగ్ మ్యూజియంకి, జూకి రోజంతా పిక్నిక్ కి తీసుకువెళ్దాం. లంచ్ అవుట్, డిన్నర్ అవుట్. అమ్మా నాన్నగారిని కూడా శలవ తీసుకోమని చెప్పమ్మా. "అంటూ తెగ గారాలు పోయారు మా కవల పిల్లలు శరత్, శశికాంత్.

మా అన్నయ్య కూడా ఎప్పుడూ నన్నూ మా ఆయన్నీ వేళాకోళం చేస్తూ ఉంటాడు. "టూ బర్డ్స్ ఇన్ వన్ షాట్ అంటూ" మా అబ్బాయిలను గురించి ఆట పట్టిస్తూ ఉంటాడు. కవల పిల్లలు కావటాన వాళ్ళిద్దరినీ పెంచటంలో మా వారు చేసిన సహాయం నేనెలా మరువగలను? ఆఫీస్ నించి వస్తానే, నేను ఇద్దరినీ చూసుకోడంలో సతమతం అవుతూంటే, పనిపిల్ల సాయంతో వంట వండటం, పిల్లల పాల సీసాలు బాయిల్ చేయటం, వాళ్ళ నాపీలు, బట్టలు వాషింగ్ మెషిన్‌లో వేరేగా వేయటం.అబ్బ, చెప్పాలంటే లిస్టుకి అంతం లేదు. అయినా అన్నయ్య మాటలకి అయన ఎప్పుడూ నవ్వేస్తారు. నేనూ అంతే.

ఇలా ఆలోచనల్లో మునిగి ఉండగానే, అన్నయ్య, వదిన అమెరికా నుంచి రానే వచ్చారు. వాళ్లకు ఇష్టమైన వంటలు, ఇండియా భోజనాల ఘుమఘుమలు వారం యిట్టే గడిచిపోయింది. వాళ్ళ జెట్ లాగ్ కూడా తీరింది. తన కూడా తెచ్చుకున్న పెట్టెల్లో తెచ్చిన బహుమతుల పంపిణీ చాలా వరకూ అయింది. ఊళ్ళో ఉన్న చుట్టాలు అందరూ తలో పూటా భోజనాలకు పిలిచారు. భోజనాలకు వెళ్ళిన వాళ్ళందరికీ వదిన పేరు పేరునా ఏదో ఒక బహుమతిని ఇచ్చి, వాళ్ళ ఆతిధ్యానికి తనదైన తీరులో థ్యాంక్స్ చెప్పకుంది. వదిన వాళ్ళ అమ్మా నాన్నగారు కూడా ఇదే ఊళ్ళో ఉండటం ఒక గొప్ప వరం. వాళ్ళకు తెచ్చిన అమెరికా బహుమతుల సూట్‌కేస్ తీసుకుని తన కూతుళ్ళు తాన్యా, ఆన్యాలను తీసుకుని ఉదయమే వెళ్ళింది.

"ఏమిటీ మీ వదిన కొంచె ఒళ్ళు చేసినట్టుంది" మా వారి కామెంట్

" మళ్ళీ మూడో నెలనుకుంటా, భోజనాలలో కూడా కాస్త రుచులు కోరింది"

" మూడో బేబీ నా?" మా వారు కాస్త చిలిపిగా అన్నారు

# ప్లస్సు - మైనస్సు

– కాళీపట్నం సీతా వసంతలక్ష్మి

"అమెరికాలో నాలుగు వరకూ అంతా సాధారణమే, మనం అమెరికాలో లేనందుకు సంతోషిస్తూంటాను, అక్కడ ఇలా ట్విన్స్ పుడితే, సహాయానికి ఎవరూ ఉండరు.చచ్చినట్టు అన్ని పనులూ మనమే చేసుకోడం, మీ చాయిస్ అంటే అందుకే నాకిష్టం" మా వారిని ఉబ్బిస్తూ అన్నాను.

" ఇప్పుడైనా మించిపోయింది లేదు, అమెరికా పోదాం, మరో సెట్ ట్విన్స్ కందువు గానీ, అక్కడ నలుగురు పిల్లలు మామూలేగా" మా వారికి ఊరికే నన్ను ఏడిపించటం బాగా సరదా.

"సరేలెండి, ఇద్దరినీ సాకే సరికి మన తల(ప్రాణం తోకకి వచ్చింది. ఇండియాలో సర్వెంట్స్ ఉండి, మీరూ హెల్ప్ చేసినా కూడా" ఉడుక్కుంటూ సణిగాను.

" కానీ ఒక విషయం గమనించారా? వదిన ఎందుకో ఎక్కువ ఉత్సాహంగా లేదు"

"అవును"

వాళ్ళ అమ్మగారింటి నుంచి వచ్చాక మెల్లిగా కనుక్కుంటా"

రెండు రోజులు అవగానే వదినా అన్నయ్యా తాన్యా. ఆన్యా వెనక్కి వచ్చేశారు. ఆ రోజు వదిన షాపింగ్‌కి వెడదామంది. ఉదయం పదింటికల్లా టిఫిన్లు కానిచ్చి కార్లో బయలుదేరాం.

"నగలు కొనాలే రాణీ పిల్లలకోసం. ఏదైయినా మంచి నగల కొట్టుకి తీసుకెళ్ళు" అన్నయ్య రిక్వెస్ట్ చేశాడు.

" ఈ చిన్న పిల్లలకి ఇప్పటినించే నగలు ఎందుకన్నయ్యా, వదినకి కొను"

"అమ్మో నీకేం తెలుసు? వీళ్ళిద్దరికీ పెళ్ళిళ్ళకి బోలెడు ఖర్చు. ఇప్పటి నుంచే నగలూ అవీ కొంచె పోగేయాలి" అన్నయ్యా వదిన ఏక కంఠంతో అన్నారు.

తెల్లబోతూ అడిగాను. "అదేమిటి అన్నయ్యా, చక్కగా చదువుకుంటారు, అమెరికాలాంటి దేశంలో ఆడపిల్లకున్న స్వేచ్ఛతో వాళ్ళకు కావలసిన వరుణ్ణి వాళ్ళే ఎంచుకుంటారు. ఇక నీకేం బాధ?"

" నా బాధ... ఏం చెప్పను? అమెరికా వెళ్ళినా మన సాంప్రదాయాలు ఏమీ మారలేదు. ఏ సంవత్సరంలో ఈ దేశంనించి బయటికి వెళ్ళామో ఆ సంవత్సరంలో గడ్డ కట్టుకుపోయాం. అక్కడ అన్నీ అగ్రహారాలే. ఒక మాట చెప్పనా? ఆడపిల్లలంటే మైనస్సులు, అబ్బాయిలయితే ప్లస్సులు. అర్థం చేసుకో" అవాక్కయిపోయాం.

" నీకేం తెలుసు మా బాధలు? వీళ్ళకి బోలెడు నగలు పెట్టాలి. కట్నం లేకపోతేనేం బంగారం ఎంతయినా ఇచ్చుకోవాల్సిందే... ఇండియన్ అబ్బాయి కావాలంటే... దానికి తోడు వదిన మళ్ళీ మరొక మైనస్సుకు జన్మనివ్వబోతోంది" అన్నయ్య నోటినించి ఈ మాటవిని నా నోట మాట రాలేదు.

ఎక్కడికి వెళ్ళినా మన దేశపు పురుషులు ఇలాగే ఉండిపోతారా? ఏమో! ఒకవంక మా వారు, పూర్తి ఇండియన్, ఇండియాలో ఉండే సగటు ఇండియన్. ఆడా మగా భేదం చూపని మనిషి. నాకూ ఇద్దరు ఆడపిల్లలుంటే ఇలాగే అనేవారా? ఏమో? అన్నయ్య అమెరికా వెళ్ళినా ఇసుమంతయినా మారలేదు. భారతీయ సంస్కృతి పేరున సనాతన భావాల ఒరవడిలో కొట్టుకు పోతున్న మిథ్యా భారతీయ సంస్కృతిని ప్రోత్సహిస్తున్న అమెరికన్ ఇండియన్.

ప్లస్సులూ..... మైనస్సులు ..... ఇంకా ఎంతకాలమీ లెక్కలు?

★

# ఉద్యమాల బాటలో...

**గుదిబండగా మారిన విద్యుత్ చార్జీలు:**

ఏప్రిల్ నుంచి విద్యుత్ చార్జీలు పెంచేందుకు ఇ.ఆర్.సి. రంగం సిద్ధం చేసింది. ఇప్పటికే పెరిగిన విద్యుత్ చార్జీలు, సర్దుబాటు చార్జీల పేరుతో బాదుతున్న బాదుడు సామాన్య మధ్య తరగతి ప్రజానీకం తీవ్ర ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. పాలకులు చేసిన తప్పిదాలు వినియోగదారులకు మోయలేని భారాలుగా మారుతున్నాయి. ప్రభుత్వం గతంలో చేసిన తప్పిదాల మూలంగా 2014-15 ఆర్థిక సంవత్సరానికి విద్యుత్ వినియోగదారులపై రూ॥9వేల కోట్ల మేర అదనపు భారం మోపడానికి సిద్ధపడింది. వినయోగదారులు తీవ్ర ఆందోళనతో ఉన్నారు. రాష్ట్రంలో ఏర్పడబోయే కొత్త ప్రభుత్వమైన ఈ భారం నుంచి తమను కాపాడాలని కోరుకుంటున్నారు. హైదరాబాద్ కమిటి ఆధ్వర్యంలో రౌండ్‌టేబుల్ సమావేశం నిర్వహించి పెంచిన విద్యుత్ చార్జీలను వెంటనే తగ్గించాలని డిమాండ్ చేశారు.



హైదరాబాద్

**మహిళా దినోత్సవం :-** అంతర్జాతీయ మహిళా దినోత్సం


అనంతపురం

సందర్భంగా, మహిళలపై పెరుగుతున్న హింసను అరికట్టాలని, అధికధరలు నియంత్రించాలని, ప్రజాపంపిణీ వ్యవస్థను పటిష్టపరచాలని, మహిళా రిజర్వేషన్ బిల్లును పార్లమెంటులో వెంటనే పాస్ చెయ్యాలని, జెండర్ బడ్జెటింగ్ అమలు చేయాలని, తదితర డిమాండ్లతో రాష్ట్రంలోని అన్ని జిల్లాలు, మండలాల్లో కార్యక్రమాలు జరిగాయి. శ్రామిక మహిళా సమన్వయ కమిటి, ఐద్వా నిర్వహించిన సదస్సులో అసంఘటిత రంగంలో పనిచేస్తున్న శ్రామిక మహిళలకు కరువవుతున్న భద్రత, శ్రమదోపిడికి వ్యతిరేకంగా పోరాడాలని పిలుపునిచ్చారు.

యు.టి.ఎఫ్‌తో కలిసి నిర్వహించిన సదస్సులో పాఠశాలలో టాయిలెట్స్ లేక బాలికలు పడుతున్న అవస్థలు, వాటిని ఏర్పాటు చేయాల్సిన అవసరాన్ని వివరించారు. అధికారులకు మెమోరాండం ఇచ్చారు. కొన్ని జిల్లాల్లో మార్చి 8 సందర్భంగా ఆటల పోటీలు నిర్వహించారు. కాలేజీల్లో నిర్వహించిన సదస్సులకు మంచి స్పందన వచ్చింది.

అనంతపురం జిల్లా కమిటి అధ్వర్యంలో బహుముఖ


ఆదిలాబాద్


పశ్చిమగోదావరి




కార్యక్రమాలు నిర్వహించారు. కాలేజీలలో వ్యాసరచన పోటీలు, కోలాటం, చెక్కభజనలతో, మహిళా టీమ్‌లతో నగరంలో ప్రదర్శనలు, మహిళా సమస్యలపై ఎగ్జిబిషన్, ప్రదర్శన వివిధ కేంద్రాలలో ఏర్పాటు చేసి ప్రజల మన్ననలందుకున్నారు. మార్చి-9వ తేది 3వేల మంది మహిళలతో సదస్సు జరిగింది. ఐద్వా జిల్లా కార్యదర్శి సావిత్రి అధ్యక్షతన జరిగిన రాష్ట్ర మహిళా కమీషన్ ఛైర్‌పర్సన్ శ్రీమతి త్రిపురాన వెంకటరత్నం, ఐద్వా జాతీయ నాయకురాలు మల్లు స్వరాజ్యం, రాష్ట్ర కార్యదర్శి కె. స్వరూపరాణి, ఎమ్.ఎల్.సి. గేయానంద్‌గారు సభలో ప్రసంగించారు. రాష్ట్ర వ్యాప్తంగా అన్ని జిల్లాల్లోనూ సదస్సులు, రౌండ్ టేబుల్ సమావేశాలు, వ్యాసరచన పోటీలు నిర్వహించారు. రాష్ట్ర వ్యాప్తంగా అన్ని జిల్లాలో కూడా కార్యక్రమాలు జరిగాయి.

**ఒంటరి మహిళపై పైశాచికత్వం :-**

మెదక్ జిల్లా తునికి బొల్లారంలో జరిగిన యాదమ్మ ఘటనపై అనేక అనుమానాలు, చర్చలు జరుగుతున్న సందర్భంగా గ్రామాన్ని సందర్శించి వాస్తవ వివరాలు సేకరించేందుకు ఐద్వా రాష్ట్ర అధ్యక్షురాలు టి.జ్యోతి, పిఓడబ్ల్యు రాష్ట్ర ప్రధాన కార్యదర్శి జి.ఝాన్సీ, శ్రామిక మహిళా సమన్వయ కమిటీ కార్యదర్శి రమ, (సిఐటియు) ఐలు రాష్ట్ర కార్యదర్శి కె.పార్థసారథి. (ఆల్ ఇండియా లాయర్స్ యూనియన్) 4-5-14వ తేదీన తునికి బొల్లారం గ్రామాన్ని




సందర్శించారు. గ్రామానికి వెళ్లి బాధితురాలిపై జరిగిన ఘటనాస్థలాన్ని, పక్కనే ఉన్న బిక్షపతి ఇంటిని పరిశీలిస్తుండగానే గ్రామంలోని దాదాపుగా వందమంది మహిళలు, పురుషులు గుమిగూడారు. అందరు ముక్త కంఠంతో యాదమ్మపై జరిగిన అత్యంత దారుణమైన అత్యాచారాన్ని, ఆమె శరీర బాగాలను కౄరంగా గాయపరచడాన్ని ఖండించారు. ఘోరానికి కారకులైన బిక్షపతిని, కొడుకు కనకయ్యను, ఇతర నిందితులను కఠినాతి కఠినంగా శిక్షించాలని, ఇంకే ఆడపిల్లకు ఇటువంటి పరిస్థితి పునరావృతం కాకుదదని, తాము ఎక్కడికైనా వచ్చి సాక్ష్యాలు చెప్పడానికి సిద్ధమని అన్నారు.

ప్రతినిధి బృందం గ్రామంలోని బిక్షపతి ఇంటిపక్కనే ఉన్న కిరాణ షాపు ఓనర్ చంద్రకళను, గ్రామ సర్పంచ్ బాలేష్‌ను, మస్కూరమ్మ ముత్యాలమ్మను, పూజారి పోచమ్మను, ఐకెపి సిఎ పద్మను, గ్రామ సమాఖ్య అధ్యక్షురాలు అండాళును, మాజీ ఉప సర్పంచ్ దామోదర్‌రెడ్డిని, బీరప్ప తదితరుల నుంచి అనేక వివరాలు సేకరించారు. అందరు చెప్పిన మాట సారంశం ఒక్కటే యాదమ్మను అత్యంత కిరాతకంగా అత్యాచారం చేసి, కొట్టి చంపారని. బిక్షపతి తొడపుట్టిన అక్కా చెల్లెళ్లు కూడా మరదలును ఆస్తి కోసం అత్యంత దారుణంగా చంపాడని, బిక్షపతి అత్యంత దుర్మార్గుడని, కఠినంగా శిక్షించాలని కోరారు.

మూడు రోజుల నుంచి జరుగుతున్న ఉద్యమం కారణంగా మెదక్ జిల్లా కలెక్టర్ మరియు ఎస్పీ కేసు పునర్ విచారణకు ఆదేశించారు. డిఎస్పీ, శ్రీదర్‌రెడ్డి, గజ్వేల్ ఎమ్మార్వో బాల్‌రెడ్డిలకు ఆదేశాలు జారీ చేశారు. గ్రామ పంచాయతీ ఆఫీసులో డిఎస్పీ, ఎమ్మార్వో సాక్షులను పిలిచి విచారణ జరుపుతున్న సందర్భంగా స్థానిక సిఐ సాక్ష్యులను పలుమార్లు బెదిరిస్తూ, వారిని పక్కతోవ పట్టిస్తూ కేసును నీరుగార్చే ప్రయత్నం చేయడం స్పష్టంగా కనిపించింది. స్థానిక సిఐ, ఎసైల పాత్ర అనేక అనుమానాలకు తావిస్తోంది.

పునర్ విచారణకు హాజరైన డిఎస్పీ మాట్లాడుతూ "306 కింద కేసు నమోదుచేసి తప్పు జరిగిందని అందుకే మళ్లీ విచారణకు వచ్చామని" స్పష్టంగా చెప్పడం ద్వారా కేసును నీరుగార్చే ప్రయత్నం జరుగుతుందని అర్థం అవుతుంది. ప్రతినిధి బృందం అనంతరం జిల్లా ఎస్పీ షిమూషి బాజ్‌పెయిని కలిసి యాదమ్మ కేసు విషయంలో దోషులపై 302 సెక్షన్‌తో పాటు నిర్భయ చట్టం కింద కేసు ఫైల్ చేయాలని, దోషులను కఠినంగా శిక్షించాలని కోరారు. ఎస్పీ గారు మాట్లాడుతూ ఈ రోజు సాయంత్రం వరకు మొత్తం అన్ని వివరాలు తెప్పించుకొని మిగత సెక్షన్స్‌కు కూడా జోడించి దోషులను కఠినంగా శిక్షిస్తామని చెప్పారు.

పోస్టుమార్టం చేసిన డాక్టర్ ప్రసన్న కూడా యాదమ్మ వదిన లక్ష్మీతో "ఈమె పురుగుల మందు తాగడం వల్ల కాదు ఈమెపై అత్యంత దారుణంగా అత్యాచారం జరిగింది. శరీర బాగాలన్నీ

చిద్రమైనవని" చెప్పి లక్ష్మీకి మృతదేహాన్ని చూపించారు.

కావున జరిగిన ఘటనలు, సాక్ష్యుల విచారణ మొదలగు అంశాలు మొత్తంగా సమీక్షిస్తే ఖచ్చితంగా యాదమ్మది అత్యాచారం, ఆపై హత్య జరిగిందని స్పష్టంగా తెలుస్తోంది. క్రింది స్థాయిలో పోలీసు అధికారుల లాలూచీ, అలసత్వంతో కేసును పక్కదారి పట్టించడం అర్థమౌతుంది. దోషులను కఠినంగా శిక్షించాలని నిర్భయ చట్టం కింద కేసు నమోదు చేయాలని, కొడుకులకు పది లక్షల ఎక్స్‌గ్రేషియా చెల్లించాలని, వాళ్ళ ఆస్తి వాళ్లకు దక్కెలా చేయడంతో పాటు రక్షణ కల్పించాలని ప్రతినిధి బృందం ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తోంది.

**హింసపై:**

విజయవాడ నగరం నేరాలకు నిలయంగా మారుతోంది. జాతీయ నేర నమోదు విభాగం లెక్కల ప్రకారం బాలికలు, మహిళలపై జరుగుతున్న హింసకు సంబంధించి 3వ స్థానంలో వుంది. ఇంటా బయటా రక్షణలేని దుస్థితి ఏర్పడుతోంది.

ఇటీవల పటమటలో హిమబిందుపై (45) జరిగిన అత్యాచారం, హత్య విజయవాడ నగరవాసులను భయాందోళనలకు గురిచేసింది. ఉదయం 11గం॥ ల సమయంలో ఇంట్లో ఒంటరిగా వున్న హిమబిందును ఇంటి ఓనర్ కారు డ్రైవర్, మరో ఐదుగురు కల్సి నీటి కొళాయి రిపేరు కోసమని చెప్పి ఇంట్లోకి ప్రవేశించి సామూహిక అత్యాచారం చేసి చంపివేశారు. నేరస్థులందరూ ముప్పై ఏళ్ళ వయసులోపు వారే. వారిలో ముగ్గురు వివాహితులు, మరో ముగ్గురు పెళ్ళి కానివారు. ఈ ఘటనను ఐద్వా తీవ్రంగా ఖండించటంతోపాటు పోలీస్ ఉన్నతాధికారులను కల్సి వెంటనే ఫాస్ట్‌ట్రాక్ కోర్టు ఏర్పాటు చేసి నేర విచారణ జరపాలని, దోషులను శిక్షించాలని డిమాండ్ చేయటం జరిగింది. హిమబిందు హత్యకు నిరసనగా జరిగిన ర్యాలీలో ఐద్వా రాష్ట్ర కార్యదర్శి, సభ్యులు పాల్గొన్నారు. ఆరుగురు ముద్దాయిలను అరెస్టు చేశారు. నిర్భయ అత్యాచారం నిరోధక చట్టం క్రింద కేసు నమోదు చేశారు. ఐద్వా జాతీయ ఉపాధ్యక్షురాలు సుధాసుందరరామన్ హిమబిందు కుటుంబాన్ని పరామర్శించారు.

**డ్వాక్రా :**



కృష్ణా జిల్లా

కృష్ణాజిల్లా తిరువూరులో పొదుపు సంఘాల అవగాహన సదస్సు జరిగింది. గ్రూపులలో జరుగుతున్న అక్రమాలపై కడు జాగ్రత్తగా వుండాలని, అధికారుల పర్యవేక్షణ వుండాలని సదస్సులో పిలుపునిచ్చారు. సదస్సుకు ఐద్వారాష్ట్ర కార్యదర్శి, ఎపిఓ హాజరయ్యారు.

తిరుపతి పొదుపు సంఘాల నిర్వహణలో (మెప్మా) కోట్లాది రూపాయిల అవినీతి అక్రమాలకు వ్యతిరేకంగా ఐద్వా చిత్తూరు జిల్లా కమిటీ ఆధ్వర్యంలో పొదుపు గ్రూపులకు సర్వే నిర్వహించింది. మెప్మా అధికారులకు అవినీతికి పాల్పడిన ప్రాజెక్టు ఆఫీసర్‌ను సస్పెండ్ చేయాలని ఆందోళన నిర్వహించారు. ఐద్వా ఆందోళన ఫలితంగా ప్రాజెక్ట్ ఆఫీసర్‌ను సస్పెండ్ చేసి విచారణ జరుపుతున్నారు.

**మైనారిటీ మహిళల చైతన్యంపై:**

ఐద్వా ఆధ్వర్యంలో కర్నూలో మైనార్టీ మహిళల చైతన్య సదస్సు జరిగింది. ఐద్వా జాతీయ నాయకురాలు సాయిబాఫరూకీ, రాష్ట్ర సహాయ కార్యదర్శి అఫ్రోజ్ సమీనా, గఫూర్ సభకు హాజరై మైనార్టీ మహిళల సమస్యలపై ప్రసంగించారు.


కర్నూలు



# మార్చి 8, అంతర్జాతీయ మహిళా దినోత్సవ శుభాకాంక్షలు



ఈ జగతికి మూలం జనని
మీ జన్మకు బీజం తరుణి.
ప్రతి మహిళా ఒక అమ్మే
మీ అమ్మ కూడా ఒక మహిళే

నీ రూపానికి ప్రతి రూపం అమ్మ
అమ్మను ఆరాధిస్తే తరిస్తుంది జన్మ
ప్రతీ ఆడదిలో అమ్మను చూడు
ప్రతీ అమ్మాయిలో అక్కను చూడు.

విజయం వైపు వేసే ప్రతీ అడుగువెనుక
ఓ మాతృమూర్తి త్యాగముందని మరువకు.
ఏ ఇంటికైనా ఆడపిల్లే ఆభరణం
ఏ దేశాభివృద్ధికైనా వనితే మూలం
అందుకే ....
ప్రతి మహిళలో దైవాన్ని చూడు
ఆమెను గౌరవించు ఉన్నతంగా ఆరాధించు
మనిషిగా జీవించు
మానవతను నిలుపు.



## బి. వెంకటరావు

ఇన్‌స్పెక్టర్ ఆఫ్ పోలీస్
పార్వతీపురం సర్కిల్, విజయనగరం జిల్లా
సెల్: 8099241212



# స్ఫూర్తి శిఖరం

స్నేహపు బంగారు తీగలతో
బ్రతుకు బంధాలను చుట్టి
అన్యోన్యతా పందిరిపై
అల్లుకున్న తీగలు
లీలా సుందరయ్యలు !

ఆశయాల వెన్నెల్లో
ఆదర్శాల మల్లెల్ని పూయించారు
జీవితమంతా పరిమళించారు
ఒకరికి ఒకరై
అందరి కొరకై
ఆధిపత్యపు జాడల
నీడలేవీ పడకుండా
దంపతులంటే ఎలావుండాలో
నిరూపించారు !

ఆకాశంలో సగాన్ని
అసమానతా అగాధంలోకి
తోయొద్దనీ !
అతివలు జతకాకుండా
ఉద్యమగతి సాగదనీ

తరాలుగా దారుణ పీడన
తరుణులపై సాగుతోంది
ఒకరికి ఇంకొకరు
బానిసగా మారటం
మనసుకు సంకెళ్ళువేసి
మరలాగ మార్చటం
ఆస్తి నిండిన ఇంటిలోకి
ఆమెను కూడా త్రోసి
'మను'వాడిన నాటకానికి
మనిషితనం నుసిచేసి
సహనంతో భరించమనీ
సహ జీవనం సాగించమంటారు వాళ్ళు
అది అనాగరిక నేరమంటావు నువ్వు
ఈ ఘోరాన్ని చూస్తూ ఊరుకోననీ
మహిళల పక్షం వహించావు
సమ సమాజాన్ని సాధించాలంటూ
సమతాగుణ నిధివై
మమతల సిరులు పంచావు !

కామ్రేడ్ సుందరయ్యా
సుందర కామ్రేడువయ్యా

కె. ఆనందాచారి

(స్ఫూర్తి శిఖరం దీర్ఘ కావ్యంనుండి)
(మహామనీషి పుచ్చలపల్లి సుందరయ్య గారి వర్ధంతి మే19 సందర్భంగా..)



Printed & Published by Mallu Swarajyam, Published at AIDWA State Office, Block No.24, HIG, Phase-II, 1-8-1, Baghlingampally, Hyderabad -500 044. Printed at Prajasakti Daily Printing Press, M.H.Bhavan, Plot No.21/1, Azamabad Industrial Area, Near RTC Kalyanamandapam, Hyderabad - 500 020. Ph: 27665420. Editor : T.Jyothi

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|
| పుస్తకం సంఖ్య | CMV01A143 |
| పుస్తకం పేరు | చైతన్య మానవి |
| తారీఖు | 21/08/2023 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Nandini |
| పేజీలు విడదీసినది | Nandini |
| స్కాన్ చేసినది | Sandhya |
| పరీక్ష చేసినది | AMRUTHA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |